పశుకృత్యము :

ధనిష్ఠ, శతభిషం, పూర్వాషాఢ, తిర్యగ్ముఖ నక్షత్రములలో మేక, గొఱ్ఱె, ఎనుము, పంది, గుఱ్ఱం, కుక్క జంతు కార్యములు చేయవలెను.

జాంతువ్యవిధి :

జ్యేష్ఠ, స్వాతి, అశ్విని, పుష్యమి, పునర్వసు, రోహిణి, హస్త, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, నక్షత్రములలో దున్న, కణితి, మున్నగు కొమ్ముగల జంతువుల పనులు శుభము

నవ జంత్వాణి :

జ్యేష్ఠ, ఆరుద్ర, రోహిణి, హస్త, విశాఖ, పుష్యమీ, అశ్వనులందు, కుజగురు వారాలలో గోటిబలం గల పులి మున్నగు వాని పనులు శుభకరములు.

వశీకరణ :

స్వాతి, హస్త, మృగశిర, చిత్త, ఉత్తర, పుష్యమి పునర్వసులు అగ్నిమండలముల నక్షత్రములు 2, 3, 6, 7, తిథులు వశీకరణకు మంచివి.

---



(7)

# పార్థివలింగ పూజా విధానమ్

భూదేవతా ప్రార్థన :

శ్లో॥ సముద్రవసనేదేవీ । పర్వత స్తనమండలే,
విష్ణుపత్నీ । నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥

భూమిపై అక్షింతలువేసి నమస్కరించవలెను.

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః ॥

ఓం నమోభగవతే వాసుదేవాయ అని పసుపు కలిపిన నీరు చల్లుకొనవలెను.

ఆచమ్య :

1. ఓం కేశవాయనమఃస్వాహా
2. ఓం నారాయణాయనమః"
3. ఓం మాధవాయనమః "
4. ఓం గోవిందాయనమః
5. ఓం విష్ణవేనమః
6. ఓం మధుసూదనాయనమః
7. ఓం త్రివిక్రమాయనమః
8. ఓం వామనాయనమః
9. ఓం శ్రీధరాయనమః
10. ఓం హృషీకేశాయనమః
11. ఓం పద్మనాభాయనమః
12. ఓం దామోదరాయనమః
13. ఓం సంకర్షణాయనమః
14. ఓం వాసుదేవాయనమః
15. ఓం ప్రద్యుమ్నాయనమః
16. ఓం అనిరుద్ధాయనమః
17. ఓం పురుషోత్తమాయనమః
18. ఓం అధోక్షజాయనమః
19. ఓం నృసింహాయనమః
20. ఓం అచ్యుతాయనమః
21. ఓం జనార్దనాయనమః
22. ఓం ఉపేంద్రాయనమః
23. ఓం హరయేనమః
24. ఓం శ్రీకృష్ణాయనమః

భూతోచ్చాటనము :

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ఏతేభూమిభారకాః ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥ (అని అక్షింతలు వాసనజూచి వెనుకకు వేయవలెను అనగా "ఓం నమోభగవతే వాసుదేవాయ రక్షరక్ష" అంటూ)

ప్రాణాయామము :

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః :ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓమాఽపోజ్యోతీరసో అమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్" (అని గాలిని పీల్చి ఈ మంత్రం చదివేది.)

సూచన : సంకల్పమునకై ఈ క్రిందివి చూడుడు.

ఆయనములు 2.

మకరం నుంచి (జనవరి 15 నుంచి) ఉత్తరాయణం.

కటకం నుంచి (జూన్ 15 నుంచి) దక్షిణాయణం.

ఋతువులు 6. (ప్రతి 2 నెలల కొక ఋతువు)

| | |
|---|---|
| చైత్ర-వైశాఖములలో | వసంత ఋతువు |
| జ్యేష్ట-ఆషాఢములలో | గ్రీష్మ ఋతువు |
| శ్రావణ-భాద్రపదములలో | వర్ష ఋతువు |
| ఆశ్వీజ-కార్తీకములలో | శరదృతు ఋతువు |
| మార్గశిర-పుష్యములలో | హేమంత ఋతువు |
| మాఘ-ఫాల్గుణములలో | శిశిర ఋతువు |

2 పక్షములు :— పున్నమి మర్నాటినుంచి కృష్ణపక్షం రోజుకొక తిది అమావాస్యతో నెలాఖరు. అమావాస్యా మర్నాటి నుంచి శుక్ల (శుద్ధ) పక్షం.

దేశకాల సంకీర్తనం :

శ్రీ గోవింద ! గోవింద ! శ్రీ మహావిష్ణోరాజ్ఞయాప్రవర్త మానస్య అద్యబ్రహ్మణో ద్వితీయ ప్రహరార్థే, ఆదిశ్వేతయజ్ఞ వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య.........ప్రదేశే.........మధ్యదేశే సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర చరణ సన్నిధౌ......గృహే,అస్మిన్ వర్త మానే, వ్యావహారిక చాంద్రమానేన ...... సంవత్సరే ...... ఆయనే......ఋతౌః......మాసే, పక్షే ...... తిథౌ - శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, మమోపాత్తదురితక్షయద్వారా మమ శ్రీఉమామహేశ్వర ప్రసాదద్వారా మమసంకల్ప ప్రీకారేణ ఇష్టకామ్యసిద్ధ్యర్థం శ్రీమతః/సగోత్రజాతః/పురుషస్య ధర్మపత్నీ నామ్నీం, అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య

గై శ్వర్య, సంతానాయుష్మాభి వృద్ధ్యర్థం, మమసంతాన అప మృత్యు, మహామృత్యు కాలమృత్యాది దోషభయ రోగనివారణ ద్వారా ! చిరంజీవ దీర్ఘాయుర్దాయ ప్రాప్త్యర్థం, సర్వవిధ నాగ దోష భయనివారణార్థం, ఇష్టకామ్యార్థాదిసిద్ధ్యర్థం, జన్మ జరా ఉభయవంశదోషాః, నానావిధ "పాపవినాశన" సిద్ధ్యర్థం,

Champaca)బ్లడ్ ప్రెషర్‌కు, వీర్యవృద్ధికి, హృదయమునకు హిత కరమైనది.

385. నాగచంపకము (నాగకేసరములు) దేహకాంతి మజ్జల వర్చును. నేత్రహితకరి, వ్రణహారి, కొన్నివస్తువుల కల యికతో అగ్ని స్తంభన కరణి

386 వకుళ: పొగడపువ్వు (Surinam medlra) బీజ ములు, దంతములకు గట్టినిచ్చును. బీజముల చూర్ణము నశ్యము చేసిన శిరోరోగంబు లడగును.

387. ధూళికదంబ (కడిమి) వీర్యవర్ధక, వరోజ్వలిని.

388 కేతకీ: మొగలి పువ్వు ( Kewda ) విద్రను కల్గించును. కామోద్దీపన-బలకారి.

389. పున్నాగ: సురపొన్న దేవతా ప్రసన్నత కల్గించును. భూతబాధ-బ్లడ్ ప్రెషర్-తొలగించును-పూలు వీర్యవర్ధకము.

390 గోరంట: (సైరేయ) (Barleria prianitis) కేశ ములకు రంగునిచ్చును విషాది ఘోర వేదనల హరించి వెంట్రు కల రాలనీయదు.

391 బంధూకము : నేతిమల్లి మధ్యాహ్నమల్లె భూత - పిశాచ బాధా హారి. దీని పూవులు మధ్యాహ్నం 2 గంటలకు విచ్చును.

392. బంతిచెట్టు : భూత-గ్రహపీడా నివారిణి.

393 జపాకుసుమ (Shoe Flower) పుష్టికారక, గర్భ వృద్ధికరి. బాలకులకు హితకరము; కేశవర్ధకము పేలు నశించును. నేయిలో మాగబెట్టిన పూలు స్త్రీలకు సుఖపూర్వక రజోధర్మము కల్గించును. సూర్యదేవునికి ప్రియమైనవి.



394. సింధూర పుష్పము : జాఫరా చెట్టు మస్తక రోగ భూతబాధ లడంచును. చండికా దేవికి ప్రియమైనవి.

395. పారిజాత చెట్టు పట్ట ఆకులో తినిన దగ్గు తగ్గును.

396. అవిసె: అగస్త్య: (Agadi glandiflora) చాతుర్థిక జ్వర నివారిణీ, రక్తపిత్తము పోజేయును. బుద్ధిదాయక, స్మరణ శక్తి వర్ధకము పీనస-భూత బాధా నివారిణి.

397. తులసి(పార్శ్వకూల)భూతబాధాహారి. దేవప్రియ మైనది.

398. మరువము: రుద్రజడ: సబ్జాచెట్టు వృశ్చికాది విష హారి; శ్రేష్ఠమైన. తెల్లవిది

399. దవనము: సావిత్రిచెట్టు, భూత ప్రేత విషబాధా హారి వీర్యవర్ధకము. విస్ఫోటకహారి.

400 వనదవనము: వీర్య స్తంభని, బలదాయిని.

401. వనబర్బరి (కారుతులసి) పిశాచ - భూతబాధాహారి.

402. అత్తిచెట్టు (మేడి) (Figtree) గర్భసంధాన కారిణీ అస్థి సంధాన కారకము బ్రహ్మమేడి యన కాకోదుంబరి : రక్తాతి సారములను, ముక్కు-వెంట పడు రక్తమును కట్టించును.

403. శిరీష-దిరిసెన : దీని వేరు చూర్ణంతో ప్రయోగాలు చేస్తారు. తిరుగు లేని రామబాణం

404. శింశుప: జిట్ట రేగి చెట్టు (Black-wood) నల్ల మాను గర్భస్రావము చేయును.

405. నల్లమద్ది: భస్మరోగము. అస్థిభంగము, ప్రమేహ హృదయ రోగహారి. కాంతి-బలజనకము కేశముల వృద్ధి నందిం చును.

219. ఉసిరిక

జరావ్యాధి నాశక-వీర్యజనక-కేశహితకరి రసము లేపనమున దేహకాంతి హెచ్చును.

220. పోతమిరియాలు :

తెల్ల మిరియాలు : విషనాశన, దృష్టి, భూతబాధా నాశకరీ-దేనితోనైనా చేర్చి రసాయనముగా సేవించతగినది.

221. ఎఱ్ఱ చిత్రమూలము

లోహవేధన-రసబంధన కల్గించు రసాయనము.

222. నల్లచిత్రమూలము : సేవించినచో వెంట్రుకలు నలువగును ఆవుపాలలో వేసిన పాలు నల్లగా యగును.

223. తెల్ల వస : వీర్యజనకము, భూతబాధాహరకము సూర్య చంద్రగ్రహణములలో ఒకపలము వసచూర్ణమును పాలతో సేవించిన, ఆ సమయముననే అత్యంతబుద్ధికల్గును. ఎవరు వసను నీరు లేక పాలతో ప్రతిదినము మాసపర్యంతము సేవింతురో వారు బుద్ధిబలము కలవారై మహాజ్ఞానులుగా నుందురు.

224 ఫిరంగి చక్క : తారుణ్యదాయకము, పుష్టిజనకము, వీర్యవృద్ధితము, రసాయనము, గర్భదాయకము దుర్బలులకు దేహ పెంపు-సొంపు నిచ్చును.

225. వంశలోచనము : శరీరధాతువుల పెంచును.వీర్య-బల వృద్ధికారకము.

226 తవాక్షీరి : (Arrowroot) పుష్టికారక, ధాతువర్ధక, బలకారక, వీర్యవృద్ధి కరణీయము, రక్తశుద్ధికారకము.



227. అష్టవర్గము : (జీవకము-ఋషభకము)మేద-మహామేద-కాకోళి, క్షీరకాకోళి-బుద్ధి-ఋద్ధి అనునవి కలిసినది) పుష్టికారక, వీర్యవర్ధక బలవృద్ధిని, విరిగిన భాగములను కలుపుటలో దివ్యమైనది రసాయనము-

228. బుద్ధిమూలిక : బలవీర్యవృద్ధికరణి - ఐశ్వర్యము పెంపొందించును-మూర్ఛ-బ్లడ్ ప్రెషర్ పోజేయును వృద్ధి; స్త్రీలకు సుఖదాయిని-గర్భదాయిని పుష్టి, వీర్యవృద్ధికరము. ఈ బుద్ధి-వృద్ధికి బదులు గుణములు గలది వారాహికంద యష్టిమధుకము : (Liquorice root అనియు Glycyrrhiza Glalira)అని గలవు. ఇవి చాలా టానిక్‌లలో వాడ్తూంటారు) నేత్రహితకరము, బల, వీర్యవృద్ధి, శరీరసుందరత పెంపొందించును రుచికరము, స్వరమును కోకిల మొనర్చును-

229. సర్పాక్షి: (పద్మపుచెట్టు) (Rauwolfia Sarpentina) బ్లడ్ ప్రెషర్‌కు దివ్యమైనది సర్ప, లూతా, వృశ్చిక, మూషక విషములను హరించును.

230. జ్యోతిష్మతీ : (బావంచి) (మాల్కంగిణీ) మేధా ప్రజ్ఞల వృద్ధి నందించును-పుష్టి-వీర్యముల కల్గించును.

231. మంజిష్ట (Rubia Cordifolia) వేరు పుట్టుమచ్చలను పోజేయును.

231A : లక్క (రావిచెట్టు బంక)ఇతరములకన్న ఉత్తమమైనది. దీనిని వేడిసీట నుడికించిన మహావర యనబడును రజోబంధనకారియగును. దీనితో చేయబడిన పత్రములపై వ్రాయుచో కొన్నివేల సంవత్సరములకైననూ చెడిపోవు.

జం-వృత్తం షోడశ పత్రికం, వృత్తం భూపురం. యంత్ర మధ్యలో "వ" బీజం వ్రాయాలి.

535. ఓం జ్వల జ్వల జ్వాలాముఖీ జ్వాలామాలినీ జ్వాలా కరాళ వదనే ఓం మహామారీ అత్రి అగచ్ఛ అత్రి తిష్ఠ శంశక్తి శాంభవీకాన్నం కురుకురు జడినాయకి, హ్రీంహసకహాం హ్రీం మయి కోటికే మం మారీ, గ్రామరక్ష శ్రీం శ్రేయసీ తుష్టిం కరోమి స్వాహా

32 వేల ఎఱ్ఱని పూలతో పూజ చేయాలి,గ్రామోత్సవంతో పూర్ణకుంభంతో, నువ్వులు, పిండి, బెల్లంకలిపినది, పానకం మినుములు (గారెలు) మధ్యకుంభం వద్ద రక్తపుష్ప,రక్తగంధం, రక్తమాలలతో పూజ విధిగా చేయాలి.

(2) "హం శం షం వం" ఇతి నవనవ లిఖితం" యంత్రం గ్రామ రక్షకం-

537. ఆకర్షణ మంత్రము

ఓం హ్రీం హ్రీం హ్రీం హ్రీంక్లీం క్లీంక్లీం జంభయ జంభయ అముకం (పేరు) ఆకర్షయ అర్షయ మమవశ్యం జ్రీం కురుకురు స్వాహా॥

ఈ మంత్రం కాదుగదా! ఏ మంత్రమైనా యోగసిద్ధి లేక సిద్ధింపదు. యోగాభ్యాసంతో అణిమాద్యష్టసిద్ధి కల్గుట తధ్యం. ఒక్క కోటి కోటి కాంతి పుంజంలో మెఱుపుల మధ్య కాన్పించే దైవశక్తి మినా ఏమీలేదు ఆ పైన ఏమి వుందో నాకు తెలియదు. నాకు తెలిసింది అంతవరకే, శరీరం ఊయెలలాగి ఆకాశానికి లేవడం అసత్యం కాదు. అణిమాద్యష్టసిద్ధికి పునాది జనవశ్యం వశీకరణసిద్ధి ఫలానా ఆయన విభూతిమంత్రం భలే వుంటుంది అని



చేర్తారు కొందరు. దీనిని దాటాలి చాలా మంది అధిగమించ లేరు. ఈ మొదటి మెట్టులోంచే బోల్తాపడతారు. స్త్రీలు చేరడం; శ్రద్ధత్వం కల్గుతుంది దీనినే అతిక్రమించి సాధించగల్గితే యోగసిద్ధి లభిస్తుంది. సరైన గురువే దీనిని చూపగలడు.

528. మంత్రవిధానం ప్రాణాయామ విధి

"ఓం హ్రీం" షోడాశవారం, (16 సార్లు) పూరకం (పీల్చాలి) ఓం హ్రీం త్రిషష్టివారం (36 సార్లు) కుంభకం (విలపడం) ఓం హ్రీం ద్వాత్రింశద్వారం (32 సార్లు) రేచకం అభ్యసించినచో పై మంత్రం 5 వేలకి సిద్ధిస్తుంది. దాని వలన ప్రాణం లేని ఉన్నవాటిని గూడా రప్పించే శక్తి కల్గుతుంది.

539. లక్ష్మీప్రాప్తికర మహాసుదర్శనము.

ఓం శ్రీం హ్రీం క్లీం హాం హాం సుదర్శన చక్రే మమ గృహే అష్టసిద్ధిం కురుకురు ఐంక్లీం స్వాహా॥ 1 లక్షకుసిద్ధి – 27 వేల హోమంతోగాని సిద్ధి.

540. మోహన సుదర్శనము.

ఓం హుం హన హన ఓం హ్రీం హన హన ఓంకార హన హన ఓం హ్రీం సుదర్శన చక్రే క్లీంక్లీం సర్వజనవశ్యం కురుకురు ఠః హ్రీం ఠః ఠః స్వాహా॥

541. వాయువ్యాస్త్రమంత్రం.

ఓం ఆం యం హ్రీం యం క్రోం యం యం ఆ వాయవ్యయా వాయవ్యోమా వాయవ్యయా వాయద్వోమా వాయవ్యయా వాయవ్యోం॥ స్వాహా॥

ఈ మంత్రం 3 లక్షలకుసిద్ధిస్తుంది. గాలిలో ఆడించవచ్చును. దీనిని పవమాన సూక్తంతో రక్తి కట్టించాలి.

406. చంద్ర (Aeasia Catchu) కుష్ఠ-ఉన్మాద-పిశాచ బాధాహరణీ దంతదృఢత, వ్రణబాధా హరణ, శరీరస్థూలత నివారించును.

407. ములుమోదుగ: లక్ష్మీప్రదము, జనప్రియము-అనేక విధములగు నొప్పులు భూత బాధల హరించును.

408. తుమ్మబంక: రక్తస్రావ నిరోధిని, భగ్నసంధాయిని

409. కుంకుడు: గ్రహబాధాహారి-గర్భస్రావిణి.

410. పుత్రజీవి: వీర్యవర్ధక-గర్భదాయక-విషహారి. సాధువులు రుద్రాక్ష తుల్యముగా ఈ బీజమాలిక ధరింతురు. పుత్రప్రదము

411. గార (Delil) భూతాది గ్రహపీడా నివారిణి. గార పండ్లు నీటిలో పిసికి ముఖమునకు లేపన మొనర్చిన ముఖకాంతి హెచ్చును. కొమ్మ గృహములలో నున్న పిశాచాలు రావు.

412. తూణీ: పుష్టికారక వీర్యవర్ధకము

413. భుజపత్రి (Betula Bhojaputhra) భూత బాధ నివారిణీ మంత్రాది కార్యములలో సిద్ధికల్గించును.

414 పలాశ: మోదుగ: (Butea Frondo) విరిగిన భాగములు జోడించును. వీర్యవర్ధని వేరు స్వరసం నేత్రబాధలకు, కాండము రాసాయనిక కర్మలకు, బీజములు క్రిమినాశనములు-

415. మోదుగబంక: దగ్గు-సంగ్రహణి ముఖరోగనివారణి.

416. హస్తికర్ణ : పలాశ-ఆయుర్వర్ధకము-అత్యంతవీర్య వర్ధకము, బలవర్ధకము.

417. బూరుగ : (శాల్మలీ) (Silk Cotton Tree) రసాయనము. వీర్యవర్ధకము, గర్భస్థాపకము, ధాతువర్ధనీ, శుక్రజన



కము నేయి, సైంధవ లవణముతో చేయబడిన పూలకూర అసాధ్య ప్రదరలను, రక్తపిత్తమును పోజేయును జిగురు మందులలో వాడ్తారు. పాదరసవికారాన్ని ఒక మాసం సేవిస్తే తొలగించును. కూట (నల్ల) బూరుగ భూత-విషబాధల హరించును-ధన్వంగ, ధనుర్వృక్ష, గోత్రవృక్ష, రక్తకుసుమ పుష్టి, బలదాయని : సంధానకారిణి.

వీర్యవర్ధకములు :

418. రుద్రాక్ష : గ్రహ-భూత బాధాహారి.

418 A మామిడిపండ్లుతీయవివి చెట్టుకు పండినవి, అరటి-పండ్లు పూలకూర,కొబ్బరికాయ,దానిమ్మజామపండు నేరేడు పనస, తర్బూజా, కర్బూజా, ఖరూర, దారపప్పు కిస్మిస్, ద్రాక్ష, శీతాఫలము, జీడిపప్పు ఇత్యాది బలవర్ధక ధాతువర్ధక వీర్యవర్ధక మాంసవర్ధక సుందరవర్ధకములు.

419. కాంచనక్షీరి : (Mimusops Hexandra) పుష్టి, బల, రస, ధాతు, వీర్య మాంసవర్ధని శీతబుకువుతో నెమళ్ళు దీనిపై చేర్తాయి

420. ఇప్పచెట్టు (Elloopa tree) ("మధూక") వీర్య, బల, పుష్టికారకము, గుండె జబ్బు గలవారల కప్రియకరము. రాజయక్ష్మ నివారిణి.

421. బాదం నూనె : వాజీకరణి : అక్రోట్‌కు దీని గుణములే గలవు.

422. జంబీర : నిమ్మ : పుష్టి, వీర్య, బల, కాంతివృద్ధి కరణి, హృదయబల తేజోవర్ధని. రసాయనము. విషహారిణీ. జంబీరము-దీని పూలు తెల్లగా, ఆకులు కాగితం లాంటి నిమ్మ

466. పందికొవ్వు : పాషాణాలను పుటాలలో పోసియదు. లేపన శక్తికి రసకర్పూరం, తేనెతో కలిపి పూత వతెను

467. అంతరతామర : ముద్దలో చాల ధాతువులు భస్మమగును.

468. ఆరుద్ర పురుగులు: పరుసువేది క్రియలు అనేక రహస్యాలు గలవు.

469. ఎలుకచెవి ఆకు: పారదబంధిని.

470. పెద్దతుమ్మి, ఏనుగుతుమ్మి ద్రోణపుష్పి: రసశోధని

471. కందిఆకు: రసబాంధని.

472. కాంతం: ఎఱుపు రంగుది రసబంధని కాంత-లోహ త్రకాలు పాషాణాలు కట్టును

473. జమ్మిచక్క రసం: రస పాషాణ తాళకాలు కట్టును. హేమ విద్యకు ప్రధానమైనది.

474. తంటెపు ఆకురసం: సన్నని మంటపై నుండగా మూకుడులో శుద్ధ రసమును త్రిప్పిన బంధిత మగును.

475. దుష్టప తీగెవేరు: లోహలు-ధాతువులు భస్మమగును

476. దూలగోవిల: పారద రసశోధని

477. పాలకూర: శ్రీఘరస బంధనకారి.

477ఎ శుక్రా త్రవము: పారద బాంధవ హేమ విద్యోప యోగిని.

478. మయూరశిఖ: వాదవిద్య, పారదబంధన, స్వర్ణాది ధాతువుల భస్మోపయోగితము



479. హేమాక్షికము రసమైత్రిగలది-గీటునిచ్చును.

480. రుదంతి : రసగర్భ పదార్థముల గట్టును.

481. తెల్లగెనుసుగడ్డ: మహాసిద్ధి ప్రదాయిని.

482. Oxide of Arsenicum అభుపాషాణము

483. Oxidum of ,, శంఖపాషాణము

ఇవి లోహ భేదన-పారదబంధనులు

484. మృదారుశృంగి : పారదబాంధిని – హేమ విద్యకు కీలకము – సీసధాతువుకలది-సీసం లేకుండా చేస్తే బంగారమే

485. సిద్ధకుంజికా స్తోత్రము—

ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే॥ ఓం గ్లౌం హుం క్లీం జూం సః జ్వాలయ జ్వాలయ జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే జ్వల హం సం లం క్షం ఫట్ స్వాహా॥

నమస్తే రుద్రరూపిణ్యై నమస్తే మధుమర్దినీ నమః కైటభ హారిణ్యై, నమస్తే మహిషార్దని"

నమస్తే శుంభ నిహంత్ర్యైచ నిశుంభాసుర ఘాతిని జాగ్రితం హి మహాదేవి జపం సిద్ధం కురుష్వమే। ఐం కారీ సృష్టిరూపాయై హ్రీం కారీ ప్రతిపాలికా। క్లీం కారీ కామరూపిణ్యై బీజరూపే నమోస్తుతే॥

చాముండా చండ ఘాతీచ ఐం కారీ వరదాయినీ విచ్చే భయదా నిత్యం నమస్తే మంత్రరూపిణీ॥

ధాం ధీం ధూం ధూర్జటేః పత్నీ వాం వీం వూం వాగధీశ్వరీ। క్రాం క్రీం క్రూం కాళికాదేవీ శాం శీం శూం మే శుభం కురు"హుం

హరిః ఓం శ్రీ ఉమామహేశ్వర దేవతా ప్రసాదసిద్ధ్యర్థే, శ్రీఉమామహేశ్వర దేవతా ముద్దిశ్య, శ్రీఉమామహేశ్వర దేవతా ప్రీత్యర్థ యథాశక్తిం పార్థివ లింగపూజాం కరిష్యే.

గురుస్తుతి :

శ్లో॥ గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణు । గురుదేవో మహేశ్వరః ॥
గురుర్ సాక్షాత్ పరబ్రహ్మ । తస్మై శ్రీ గురవేన్నమః ॥

గణపతి ధ్యానం :

గణానాం త్వాగణపతిగ్‌ంహవామాహే కవిం కవీనాముపమ శ్రవ స్తమం జ్యేష్టరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే అనశ్శృణ్వన్ మాతిభిస్సీద పాదనమ్॥ శ్రీ మహాగణాధిపతయేనమః.

హరిః ఓం అస్యశ్రీ ఉమామహేశ్వర మహామంత్రస్య వామదేవఋషి । పంక్తిశ్ఛందః । శ్రీ ఉమామహేశ్వరో దేవతా హ్రీం బీజం । నమః శక్తిః । శివాయ కీలకం । మమ శ్రీఉమా మహేశ్వర ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః ।

ఓం హ్రాం అంగుష్టాభ్యాంనమః హృదయాయనమః
ఓం హ్రీం తర్జనీ " శిరసేస్వాహా
ఓం హ్రూం మధ్యమా " శిఖాయవౌషట్
ఓం హ్రైం అనామికా " కవచాయహుం
ఓం హ్రౌం కనిష్టకా " నేత్రత్రయాయవౌషట్
ఓం హ్రః కరతరమధ్యే" అస్త్రాయఫట్

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

గాయత్రి చెప్పి చుట్టూ అక్షింతలు చల్లాలి.



ధ్యానం :

శాంతం పద్మాసనస్థం । శశిధర మకుటం । పంచవక్త్రమ్ త్రినేత్రం । శూలం వజ్రంచ । ఖడ్గం పరశు మభయం దక్షభాగే వహంతం । నాగం పాశంచ । ఘంటాం ప్రళయ హుతవహం । సాంకుశం వామభాగే । నానాలంకార యుక్తాం స్ఫటిక మణినిభం । పార్వతీశం నమామి ॥

దక్షాంకస్థం గజపతి ముఖం పాణిమృజన్ దక్షదోష్ణా । వామోరుస్థాగపతి తనయాంకే గుహంచాపరేణ ఇష్టాభీతీ వరకర యుగే ధారయన్నిందుకాంతిః । అవ్యాదస్మాం త్రిభువనతో సిల కంఠ త్రినేత్రః ॥

పంచపూజలు :

లం పృథ్వీతత్వాత్మనే శ్రీఉమామహేశ్వరాభ్యాం నమః
గంధం పరికల్పయామి.

హం ఆకాశతత్వాత్మనే శ్రీఉమామహేశ్వరాభ్యాం నమః
పుష్పం పరికల్పయామి

యం వాయు తత్వాత్మనే శ్రీఉమామహేశ్వరాభ్యాంనమః
ధూపం పరికల్పయామి.

రం తేజోతత్వాత్మనే శ్రీ......నమః దీపం పరిజ్వాల్యామి

వం అమృత తత్వాత్మనే శ్రీ......నమః అమృత నివేదనం
పరికల్పయామి

సం సర్వతత్వాత్మనే శ్రీ......నమః
సర్వ దేవ, రాజ, భక్త్యోపచారాన్ సంకల్పయామి

## స్వర్గీయ దాచేపల్లి నర్సయ్యగారు



## అంకితము

మా కుటుంబ – సంస్థల అభివృద్ధికి. ప్రధానమూర్తి "ఉత్తముడు" "సహృదయుడు" అని పేరొంది 7-2-1971 న స్వర్గారోహణమున శ్రీహరిలో తాదాత్మ్యతనందిన మా అన్నగారి ఆత్మశాంతికి ఈ మహాగ్రంథము ప్రేమ పూర్వకముగా అంకితమొనర్పబడినది.

భవన్మిత్రుడు

దాచేపల్లి హనుమంతరావు

263. తాళిసపత్రి : (Taxusbaccata) క్షయ, శ్వాసకాస అడంచును. వమనరోగంబుల పారద్రోలును.

264. పర్పట్ (హిందీలో పపడీ, పనరీ, పపరీ) పద్మావతి అని అంటారు. ఇది మాళవదేశంలో గొప్పగా చెప్పుకొనేది. దీనిని వస్త్రముల పెట్టెలలోనుంచిన, ఆ దుకూలములను ఏ విధమగు క్రిములు పాడుచేయవు.

265. తిప్పతీగ (Tinospora cordifolia) గుడూచి రసాయనము. నేత్రహితకారీ, ధాతు, మేధావర్ధక, అవస్థావ్యవస్థాపకియే గాక చక్కెర రోగమును రూపుమాపును.

266 కందతిప్పతీగ : (Ciss-ampelosconvolvulacea) వలీపలిత, సన్నిపాత, భూతరోగాది హారకము.

267 తమాలము: (తమలపాకు) బ్లడ్ ప్రెషర్ కల్గిస్తుంది. ధారణశక్తి, కామాగ్ని వర్ధకము, స్త్రీలకు సౌభాగ్యప్రదాత-పండిన-ప్రాత ఆకులు పురుషత, బలసిద్ధికరీ, హృదయహితకారి. క్రొత్త ఆకులను నీటిలో 24 గంటలు నానినతర్వాత భుజించిన శరీరవర్ణము, ఆరోగ్యము పెంచును.

268 బిల్వము : అత్యంత పవిత్రము చందన సమానము లక్ష్మీ పదము. —చింతగింజల గుణప్రభావము గలది.

269. గుమ్మడి: (Gmilina Arboria) రసాయనము, వీర్య వర్ధకము, బలదాయకము కేశహితకారి, క్షయ నివారకము పైత్యదరం దూరము జేయును.

270 శ్వేతపాటలం: కలిగొట్టుచెట్టు: (తామ్రపుష్పీ) భూమి



పాటలం: వీర్యవర్ధక-బలజనకము. మండలీకకుష్ఠు పోజేయును-నొప్పుల హరించునది వర్లీ పాటలము.

271. శ్రీపర్ణ- (గిరికర్ణిక-అగ్నిమంధ = నెల్లిచెట్టు) వాతనొప్పులు, వాపులుపోజేయును-

272 పెద్దమాను (Orocylum Indicum) దగ్గులను అణచివేయును అతిసారహారిణి జఠరాగ్ని, వీర్య, బలముల పెంపొందించును. పుటపాకవిధిన అరగదీసి త్రాగిన పురాణాతిసారహరణమగును.

273. ముయ్యాకుపొన్న:( Desmodium gangeticum ) శాలిపర్ణి, విదారిగంధ అంటారు రసాయనము పుష్టికారిణి. ధాతు-వీర్య-బలజనకరణి సన్నిపాత: విషమజ్వర రక్తాతిసార హారిణి.

274. తెల్లవాకుడు (OPhioxylon serpentinum) గర్భకారిణి, పార్శ్వశూల-ఇతర శూల హారిణి వీర్యనష్టి-

275. చిన్నపల్లేరు (గోక్షుర = Pedalium Murex) ఆయు వీర్యవర్ధ, పుష్టిదాయక, మూత్రాశయ శుద్ధికరీ, మూత్రరాయి నివారించును. పెద్ద (ఏనుగు) పల్లేరు అధిక గుణములు కలది.

276 జీవంతీ : (Dregia valubelis) (మధుస్రవ) బలకారిణి, నేత్రహితకారి. వీర్యవృద్ధికరణి క్షయరోగము, దగ్గు పోజేయును స్వరమును కోకిల కంఠరీతి చేయును. కఫకారిణి, ధాతువర్ధన చేయును. బ్లడ్ ప్రెషర్ పోజేయును భూత విద్రావణి. దేవిని బృహజ్జీవంతి యందురో అదియే పాలకూర

277 స్వర్ణ జీవంతి: పాలకూర-ఇదే గుణములు గలది-

వశీకరణసిద్ధి. కిన్నెర స్వరము నిచ్చును. అన్నీ ఒకటే యన వచ్చును-

358. లజ్జాలు : మునుగుదామరము. గుబ్బంతంటాకు. శాస్త్రమూలి-(చుయి - ముయి) (Mimosascusetiva) బ్లడ్ ప్రెషర్, అతిసార, యోనిరోగహారి - విపరీత లజ్జాలు అత్తపత్తి-అంటారు. పాదరసబంధని-నానా-ప్రకార చమత్కారముల ప్రదర్శించును. రసనిష్పత్తికరణి.

359 దుగ్ధికా : పిసపాలచెట్టు (Euphrobia Hirta) గర్భదాయకము, మూత్రకారి, మలనిరోధిని, వీర్యవర్ధని.

360 నాగార్జుని : రెడ్డివారినానుబాలు, యోగిని; వీర్యవర్ధకము, గర్భస్థాపకము, ధాతువర్ధకము, పాదరసబంధిని.

361. నేల ఉసిరికె : (Phyllanthus Niruri) విషనాశనము, పుత్రదాయకము.

362 : బ్రాహ్మి : (Indian Pennywort) మేధాజనము,

అవస్థాస్థాపకబుద్ధి - ఆయు, కంఠ సుందరత, హృదయబలముల నిచ్చును-ఆరు మాసాయి సేవించిన కవీశ్వరుడగును రసాయనము-ఉన్మాదనాశని.

363 తుమ్మి : ద్రోణపుష్ప : (Lancas Celoloalotuo) పక్షవాతము పోజేయును.

364. సూర్యభక్తా : ప్రొద్దుతిరుగుడుచెట్టు. (Sun flower) సువర్చలా : భూత, గ్రహపీడా, ఉగ్రశీత జ్వర నివారిణి రసాయని. కిన్నెర స్వరమిచ్చి, మూత్రరాయి తొలగించి, మూత్రకృచ్ఛముల, కర్ణశూలల, విస్ఫోటకముల తొలగించును.

ఈ మహాగ్రంథమును

* శ్రీ దత్తాత్రేయ తంత్రము

శ్రీ కామవిద్యా తంత్రము

కల్పతరు తంత్రము

చింతామణీ తంత్రము

కౌతుకజాల తంత్రము

శాంభవీ విద్యా తంత్రము

శ్రీ విశ్వామిత్ర తంత్రము

శ్రీ తిరుమల తంత్రము

శ్రీ పద్మావతీ జాలవిద్య

శ్రీ రమా వినోదవల్లరి

అని అంటారు.

ఫ్రాం ఫ్రాం అనా "కవ"
ఉచ్ఛిష్టాయ కని "నేత్రి"
అస్త్రాయ ఫటా ఫట్ స్వాహా.

మంత్రం : ఓం భూతల స్థల వాసిని ప్రకృతి వినోదాయ భేతాళాయ మమ ప్రతివాదినీ - చర్మ పాత్రిం (పాద రక్షతో) క్రోం క్రోం మర్దయ, లలలల ఠంఠం ఖె ఖె మారయ మారయ హుంఫట్ స్వాహా॥

1 లక్ష జపం 7 రోజులలో చేయాలి. వడపప్పు-పానకం నివేదన - మినుములు 108 సార్లు మంత్రించి శత్రువు పాద రక్షలలో వేసిన — లేక యుక్తిగా చెప్పులో యుంచిన అ చెప్పులు తొడిగిన ఆ శత్రువు క్రింద పడును, ఆ చెప్పులు లేచి అతనిని బాగా కొట్టును.

523. ప్రత్యక్ష జ్వాలలు :

ఓం అం రం రం క్రోం రం ఈం హరి మర్కట మర్కటాయ ఓం రం రం ప్రత్యక్ష జ్వాలేన లంకావత్ జ్యోతిర్జ్వలనం కురు కురు హుం హుం రం రం క్రోం హుం ఫట్ స్వాహా॥

ఆషాఢ పూర్ణిమలో రాత్రి ఏక పాదంపై నిలచి 5 వేలు జపించిన సిద్ధి-జ్యోతి దానంతటదే వెల్గును.

సర్వ మంత్ర యంత్ర తంత్ర బంధన

514. ఓం అం గ్లౌం హుం హ్రీం క్రోం ఏహ్యేహి కాళరాత్రి కామేశ్వరీ సకలసిద్ధికరీ సకల కౌతుకకరీ దృష్టిబంధనం కురు కురు వార్తాబంధనం కురు కురు ఠం ఠం ఠం అంగ్లౌంక్రోం హుం ఫట్ స్వాహా॥

10 వేలకుసిద్ధి-108 కార్యక్రియకు-



శ్రీ విశ్వామిత్ర కృత మంత్రం సద్యోముఖ తుండబంధినీ

ఓం నమోభద్ధి హోంబల జః జః చిలిచిలి కిలికిలి స్వాహా॥

ఓం అం హ్రీం శ్రీం సౌః క్రోం నమో మరాసురా న్నమస్కృత్య ఇమాంవిద్యాం ప్రయోజయేత్, విద్యాం ప్రయోజయే న్మియ్యం విద్యామేశిధ్యతి శివాజంబుకానాం (నక్కలు) మూషకాణాం (ఎలుకలు) మృగాణాం (మృగములు) వృకాణాం (తోడేళ్ళు) అన్యేషాం (ఇతర) ప్రాణినాం వదనం దుష్టవశం కరోమి అర్ధిపాణె కృతపున్నశ్చ తేన పాపేన లిప్యతే రుధిరం మంత్రోస్యతే క్రమ్యతే స్వాహా॥

50 వేలకు సిద్ధి-27 సార్లు పనికి వాడాలి.

మోహన మంత్రం - ఇంద్రజాలి విద్యలకు

ఓం అంగ్లౌం ఐంహ్రీం ఐంక్లీం సౌఃక్రోం యేహ్యేహి కౌముదీ జ్వాలామాలినీ మోహయ మోహయ ఇంద్ర జాలమయే మహేంద్ర జాలమనో వైచిత్ర్యకే హుంఫట్ స్వాహా॥

స్మశానంలో 1 లక్ష జపం చేయాలి.

నిధులు.-స్వర్ణ-ఆకర్షణ ప్రదము

ఓం అం హ్రీం గ్లౌం ఐం హుం శ్రీం ఐం సౌః గౌం హుం క్రోం ఏహ్యేహి వింధ్యవాసిని బ్రహ్మ విష్ణు మహేశ్వ రాది వినుతే ఏహ్యేహి అంగ్లౌంఆగచ్ఛాగచ్ఛ హ్రీం ఆదివిష్ణు సోదరీ అపరిమిత దయాపరే అంహ్రీంక్రోం స్వర్ణాకర్షయా కర్షయ నిధిం దేహిదేహి నిక్షేపందాపయ దాపయ స్వర్ణాకర్షయ దుం దుర్గే స్వాహా॥

204. జోరీగవలాయనీముయ

నందివర్ధనము-మోదుగవేరులను బాగుగా నమలి ఆ ఉమ్మి

నీటిని చెవిలో పోసిన చెవిలో దూరిన జోరీగ నశించును.

205. విషహరణీయము

పుత్రజీవిని విస్మపండ్లతోనూరి త్రాగించిన దావానలము

వంటి విషమైనను శమించును.

206. ఎక్కువగా విషభక్షణచేసిన వారలకు టంకణమును

నేతిలో గలిపి ఇచ్చిన విషహరణమగును.

207. నేలతంగేడు సమూలం ఎండించి చూర్ణించి 2 తుల

ముల పొడి పెరుగుతో తినిపించన, మహాఘోరవిషమైననూ

శాంతించును-

208. బాలరక్షణీయము

ఉదయకాలమున మయూరశిఖ వేరు దెచ్చి బాలుర కంఠ

మున గట్టిన గ్రహపిశాద-రాక్షస-రోగబాధలుండవు.

209. మూషకవిషహరణీయము

ఎలుకవిషం శరీరమున వ్యాపించి బాధనందెడు వాని పేరును

పదిసార్లు పలుకుచూ 10 గుప్పిట్ల మన్ను పారవేసిన అ దోషమ

శమించును.

210. మత్స్య విషహరణీయము

ఊడుగ ఆకుల ధూపమున సుఖము కల్గును.

211. కృత్రిమవిషహరణీయము

పిప్పళ్ల ఊరుగువేరు కషాయం లేక చూర్ణమును 3 రోజుల

సేవించిన ఎంతటి క్రూర కృత్రిమవిషమైనా హరించును.



212. వృశ్చికవిషహరణీయము

వెచ్చని నేతిలో సైంధవలవణము కలిపి త్రాగిన

ఆయాసం, చెమట వణకు తాపము-విషము శమించును.

213. శునక (కుక్క) విషహరణీయము

ఉమ్మెత్త సమూలరసం, పాలు, నేయి, బెల్లం ఈ మొత్తం

2 పలములుగా గ్రహించి త్రాగిన పిచ్చికుక్క విషము పోవును.

214 ఉమ్మెత్తకాయను వేగిన రసమున నూరి తినినను

215. బ్రహ్మమేడి వేరు, ఉమ్మెత్తపండులను బియ్యం

కడుగుతో సేవించిననూ పిచ్చికుక్క విషము దిగిపోవును.

## వృక్షమహిమాణీయము

పద్మా! ఈ తిరుమల కొండపైన - అహోబిలపర్వత -

శ్రీశైలపర్వతములలో అనేక ఓషధులు గలవు. వృక్షమహిమలు

చెప్పగలను. శ్రద్ధగా వినుము అని ఇట్లు చెప్పసాగెను.

216. చింతగింజలు

మూషక-దుష్టవిషహారకములు

217. శతావరి (నున్నిషణ్ణమానశాకము) వీర్యవర్ధకము-

రసాయనము

218 తానికాయ

కేశవర్ధక-కేశహితకర-కాంతి జనకము

యనంలో కొందరొక జాతివారు కద్దారు. గ్రహరక్ష-దీక్ష
పవిత్రము-భూతనాశనము.

309. తెల్లగడ్డి : వీర్యవర్ధక-బలకారిణి.

310. తుంగముస్తెలు : (Elephant Grass) మూ
కృచ్ఛ్రహారిణి-బల-వీర్యవృద్ధిదాయిని. వీర్య, రజ, మూత్రము
శుద్ధి చేయును-

311. కామంచిగడ్డి : (Andrapogon Schoenathus)
శస్త్ర, శల్యాదిదోషనివారిణి. బాల గ్రహముల పారద్రోలును.

312. దీర్ఘరోహితాష్ట : భూత, గ్రహ, విషదోష
వర్ణనక్షతాదుల పూరించును. నిమ్మనూనె దీనినుండియే తీయుదురు
మొత్తమున సుగంధ తైలము గలదు.

313. భూతృణ : భూతగ్రహావేశ నివారకము దారు
వికార విషాదు లదంచును. (పచ్చిగడ్డి-కోటలలో ఉండునది)

శల్పిక: (గడ్డి) గింజలు బలవర్ధక-వీర్యవర్ధకము.

మంధతృణ: బహువీర్యవర్ధకము గోప్రియకర క్షీరదాయి

వణ్యంధాతృణ: శస్త్ర ఘాతములను వెంటనే నివారించును.

314. నీలదూర్వా (Creaping cynodan) వాంతి, దాహ,
మూర్ఛ గ్రహపీడా, భూతబాధా, శ్రమ నివారిణి. సంజీవి అనే పేరు
దీనికి గలదు.

315. నేలగుమ్మడి : (విదారి కంద) (వారాహి కంద)
(Duraria Tuberosa) పుష్టి, దుగ్ధ, బల, వర్ణ వికాసకరి మూత్ర
వృద్ధి, స్వరమునకుహితవు కల్గించును. రసాయనము.



316. నేలతాడి గడ్డలు: ( Hypoxisorchioides) రసాయ
నము, పుష్టి, బల,కారిణి, భగందర-మలలు ఇత్యాది గుదజ రోగ
నివారిణి. స్థిరత మృదుత కల్గించును. తెల్లది శ్రేష్టము

317. శతావరి (పిల్లి పీచర) (Asparagus Racemosus)
వీర్యవర్ధక, దుగ్ధప్రదా, బలదాయక, మేధాజనక, శుక్రజనక,
పుష్టికారక నేత్రహితకారి, హృదయ హితకారి - సంగ్రహణి నివా
రకము

318. అశ్వగంధ (Winter cherry) రసాయనము, వీర్య
వృద్ధి అత్యంతమగును బలదాయకము క్షయ నివారకము, అశ్వ
గంధ ఆకులు లేపనమున గండమాల. గ్రంథి, అపచి దూరమగును.

319. లఘుదంతి: (పికల్బ) (Crotten seeds)
మలమూత్రకరి.శల్యదూరిణి మూత్రమందలి రాయి హరించును.

320. నేపాళము (జయఫల్-జమాల్ గోటా) ( Crotten
Seeds) నూనెను Olium crotonis అంటారు.
పూర్వం ఆయుర్వేదం అంటూ చాలామంది నేపాలం గోలీలు వాడే
వారు.ధనుర్వాతం,ఏకాంగవాత-జ్వర, ఉన్మాద-ఆమవాత-ఉబ్బులను
(వాపులకు) లేపనమున బాధలు తీరును. దీనిని శుద్ధి చేయక వాడి
ననూ, అజాగ్రత్తగా వాడిననూ ప్రమాదమని "హకీం లోగ్ ఇస్కా
దేనా వర్జిత్ కర్తే హై దీనికి విరుగుడు నేయి త్రాగించవలెను.
మోతాదు 2 బియ్యం గింజలకు మించరాదు.

321. పెద్దవెర్రిపుచ్చ: (Bitter Apple) పావరలుడమ-
శ్లీపదమును నివారించును. మూఢగర్భవిదారణి.

322. నీలి (Indigo) మద-ఘోర విషహారిణి. కేశముల

# ద్వితీయాధ్యాయము

## కౌతుక విద్య

"శ్రీమదహోబల శ్రీలక్ష్మీనృసింహ ప్రభువుని మనమున ధ్యానించి నీకీ కామరూప తంత్రమును చెప్పుచున్నాను. శ్రద్ధగా ఆలింపుము రామభద్రా యని శ్రీరామచంద్రునికి శ్రీ విశ్వామిత్ర మహర్షి ఈవిద్యా తంత్రముపదేశింప సాగెను.

"శ్రీరామచంద్రా! షట్కర్మములు, ఆగమములు, నిగమములను ఇంతకు పూర్వమే చెప్పి యున్నాను. అస్త్రవిద్యలను చెప్పి యున్నాను. దేవతా యక్ష-కిన్నెర - కింపురుష-గారుడోరగాది సుర సుందరీ సాధనముల బోధించితిని. ప్రస్తుతము అత్యంతావశ్యకం బగునవి మాత్రమే చెప్పుచున్నాను వినుము ముందుగా "దృష్టి బంధనము" వివరింతును. కౌతుకంబద్భుతంబందు ముందుగా సాధింపదగినది.

### 1 దృష్టిబంధన :

"పిల్లేంద్రము" అనేది ఒకదుంప, దానిని తెల్లావాల నూనెతో భావనజేసి: దానిని నోటియందుంచుకొని ఎవరియొద్దకు పోయిన ఆ ఎదుటివారికి కండ్లు కాన్పింపక వారిదృష్టి బంధింపబడును. శ్రీరామచంద్రా కిష్కింధాపురమున వాలియను వీరుడు గలడు. అతడు అనేక పర్వతములపై గల వనమూలికల నెరింగినవాడు. అతనియొద్ద ఇట్టి మహత్తరవిద్యా తంత్రము గలదు. అదియే ఇది. కనుకనే వాలికి ఎదురుగా నున్న వారిని వాలి జయింపగలడు నాయనా!

### 2 అశ్వములకు దృష్టిబంధన

నల్లజీలకర్ర చూర్ణముతో కాటుకబట్టి, దానిని గుర్రము కంటికి కాటుక బెట్టినచో ఆ గుర్రమునకు కండ్లు కాన్పింపవు. శ్రీరామ చంద్రా! శత్రువుల గుర్రములకు కాటుక బెట్టిన శత్రువు లోడిపోవుదురు శత్రువులే మన గుర్రముల కిట్లు చేసినచో అవు మజ్జిగతో గుజ్జముకండు కడిగించిన, గుజ్జమునకు కండ్లు కాన్పించును సుమా! ప్రయోగము-ఉప సంహారమును తెలుసుకొంటివి గదా!

"కామరూపాణి వివిధంతు ప్రవక్ష్యామి"

### 3 దశకంఠ రూపము :

శ్రీరామా! మునగగింజలనూనె, పావురముమలము పంది క్రొవ్వు, గాడిదక్రొవ్వు, హరిదళము, మనస్శిల సమభాగముబగా గ్రహించి, మర్దించిన దానిని; ఎవరైన ఫాలమున తిలకముగా ధరించినచో, ఇతరులకు పదితలల వాని వలె కాన్పించును లోకమున ఇట్టి వింతమానసి మహారావణుడు గలడు. అతడు లంకాధిపతి. వానికి పదితలలు గలవు, వీనినే మహారావణుడందురు. ఈ రావణులు ఐదుగురు. మహారావణుడు మొదటివాడు, రెండవాడు శతకంఠ రావణుడు, మూడవవాడు సహస్ర కంఠ రావణుడు, నాల్గవవాడు పాతాళమునందలి మైరావణుడు, ఐదవవాడు అహిరావణుడు. ఈ ఐదుగురిని ఒకే ఒక వీరుడు, తిరుగులేని బాణము గలవాడు, ఒకేమాట, ఒకేబాణము, ఒకే భార్య గలవాడే వధింపగలడు. దాశరధీ!

432. ఆమ్లవేతసచెట్టు: శతవేధినీ-బేధినీ లోహాల్కో. కో. మయిాం కో గలానేవాలా.

433. మోదుగకాండ: రసాయనకర్మ కుపకరము

434. మోచరసము: (బూరుగబంక) పారద విషవికారహారి

435. పొన్నగంటి: రసదోష విషహారి.

436. మయూరశిఖ: వాదవిద్య, వశ్యకర్మలకు, రసబంధనకు స్వర్ణాదిదాతు భస్మోపయోగము వస్తువులతో కలసిన అగ్ని స్థంభన.

437. జీవంతి: మనుజాల సరస్పరిల్లా రసబంధని

438. అంకోల: రసశుద్ధికరి.

439 వెదురు: రసకర్మ లందు త్తమము.

440. గండదూర్వా లోహవిద్రావిణీ

441. రసబంధనులు:

442. శివలింగి: లింగదొండ: లోహ స్థంభిని, రసబంధనీ దివ్యవశ్యరసవియామిని సర్వసిద్ధికరి.

443. ఎఱ్ఱచిత్ర మూలం: (Rose Coloured lead wort rosea) పారద బంధనకారి, లోహవేదనకారి, రసాయనము.

444. శంఖపాషాణం: oxide of aasenic ఆఖు పాషాణము లోహ భేదకము పారదబంధనీ.

445. వైక్రాంతం: లోహాలను వికృతింపజేయును పారద విషదోష నివారిణి.

446. నవాసారం: రసజారణకరి వజ్రక్షార క్షారశ్రేష్ఠ.

. సర్జాక్షర: సోడాకార్బ్, యోగవాహిని

448. టంకణం: రసశోధిని, రసఘ్న, ధాతువల్లభ, ధాతుసందానకరి-లోహశుద్ధి లోహద్రావి.

449. చుక్ర: రసామ్ల సహస్రవేది. దాదిమరసం (వండింది మంచిది)

450. వజ్రం: పురుషజాతి రసబంధనీ

451. అన్నభేది: గోధని, ధామశేఖర

452. బోదతరం: రసబంధని

453. గవ్వ: పసుపురంగుది, రసవాదానికి ఇంద్రజాల విద్యలకు మంచిది.

454. మైలతుత్థం: భేదకం హేమసారం తామ్రోప ధాతువు-

455. అభ్రకం: వజ్రాభ్రకము అరవవిది మంచిది.

456. జనప: పారదబంధిని

457. లజ్జాలు: అత్తపత్తి రస విప్పత్తికరి

458. పినపాల: నాగార్జున పారదబంధిని.

459. ఈశ్వరి: (కంద వుంటుంది) పారదబంధని.

460. తమాల: తామ్రవల్లీ-తాళ-శోధిని.

461. పలాశ, రసామ్ల-కాంజిక-సురపర్ణ-విషాదని.

462. కరవీరకంద: రసబంధని, లోహముల కరగించును.

463. దూలగొండి: సూతవల్లభ-విషఘ్ని,దుస్పర్శ-దహావ

464. కరజోడి-పారదబంధినీ.

455. బోల: గంధరస-పార-శోధరస.

ం
ం
ద
శ్వే
శ్వే
ంతిం
స్తం
ప్యామ,

232. పతంగిచెట్టు: (Sappanwood ) విస్ఫోట, భూత, ఉన్మాద నాశని.

233. దాహాగరు: ధూపాగరు అంటారు. కేశదోషహారి కేశవర్ధకము నిరంతర సుగంధితము.

234. దేవదారు : (cedrus – deodara) లేక pine అను టర్పెంటైయిన్ కాష్టదారుఅంటారు. భూతబాధానివారిణి,టర్పెన్ టైన్ అనే కర్పూరతైలం తీస్తారు. ఎంతటి వాపులు, నొప్పులనైన నైన పూసినచో క్షణమాత్రమున నివారించును. నల్లుల చంపుటలో రామబాణము

ధూపసరళదేవదారు (Pinus) భూతబోదాహారిణి దేహశోధనమున కాంతివృద్ధి కల్గించును. రాక్షసబాధ మరియు అలక్ష్మిని నివారించును.

235. నందివర్ధనము : భూతోన్మాదము-భయము మూర్ఛ విషనేత్రదృష్టి దోషముల నివారించును.

236. పద్మపుచెట్టు:గర్భస్థాపన చేయును (Prunus puddam) అంటారు-

237. గుగ్గులు (మహిసాక్షీ) (Indian Dillium) బంగారు వలె మండునది మానవులకు కల్యాణ కారిణియగును. విరిగిన ఎముకలను జోడించును. రసాయనము-వీర్యకారి, స్మరణవృద్ధి కారి క్రొత్త గుగ్గిలము పుష్టి, మైధునశక్తి వృద్ధిపరుచు. జామ పండు రీతి బంగారురంగు గలది క్రొత్తది పాతది పనిచేయదు. క్రొత్తదాని ప్రభావము 3 మాసములవరకు తగ్గదు.



238. గంధపెరోజా : (Gumcopal sandarack) గ్రహ రాక్షసబాధా నివారకము. యోనిరోగముల బోజేయును. వృష్య, శుక్రకారక, కాంతికారకము.

239. సర్జరసము : (Yellow Resin) అలక్ష్మి, అతిసార అగ్ని దగ్ధ, గ్రహబాధాహారి.

240. పిరంగి సాంబ్రాణి : (olibanum) గుగ్గిలము అందుగుచెట్టుగోందు కుందుష్క మనబడునది అలక్ష్మి గ్రహబాధ నివారిణి, అండకోశబాధాహారకము.

241. అంబరు : (Liquid Amber) వీర్యవర్ధక, కాంతి కర, బలదాయక. గ్రహదోషాది రోగహారి మూత్రాఘాత, అసౌందర్య, వివర్ణ నివారకము.

242. జాజికాయ (Nutmeg) వీర్యవృద్ధి చిచ్చును. వాంతి కట్టించును. గుండెకు బలమిచ్చును. ఆమాతిసార అజీర్ణ - జిగట విరేచనములను నివారించును ఇది అతిగా సేవించిన దాహము కల్గి మరణము కల్గును. 2 కాయలు కసకస నమలి మ్రింగినవారు దాహపీడచే చచ్చును. విరుగుడు ధనియాలు పచ్చకర్పూరంతో గల శీతోపలాది చూర్ణము. మోతాదు 2-10 రతులు మాత్రమే

243. జాపత్రి: ముఖరోగహారి, వర్ణవికాసిని, జడతను తొలగించును.

244. లవంగము (దేవకుసుమము)(Clove) మస్తకరోగ శ్వాసకాస, దగ్గు జలుబుల నివారించును లవంగతైలము దక్కెర, క్యాప్స్‌లో వాడవచ్చును. దంతబాధలకు దూదితో అద్ది పెట్టిన తీరును.

14. నెమలి రూపము

విశ్వామిత్ర ప్రియకరా! రఘురామా! నెమలితలతో పై యోగమును సాధింపవచ్చునయ్యా!

15. పిల్లి రూపము :

భవిష్యద్రామాయణ నాయకాగ్రణీ! సోమవారం నాడు చచ్చిన పిల్లితలతో పై యోగమును సాధింతురు.

16. రాక్షస రూపధారణ :

ఊడుగగింజల నూనెను కృష్ణపక్షము చీకటిరాత్రులందు శరీరమునకు పూసుకొనిన వారలితరులకు రాక్షసులవలె కాన్పింతురు వారిని జూచి మృగ, పక్షి, పశ్వాదులు భయభ్రాంతము లగును.

శ్రీరామా! ఇంకను కౌతుకముల కల్గింపగల జాల విద్యయను "మహామాయ"ను తెలియజేయుదునువినుము. అవి: ఆనాడు విశ్వామిత్ర మహర్షి నాకు చెప్పిన విషయములను చెప్పుచున్నాను వినుము.

ఆకాశరాజ నందినీ! వినుము చాలా ఆశ్చర్యకరమగు కౌతుక రహస్యములను తెలియజేయుచున్నాను.

17. ఇంటి నిండా పాములే :

మంగాంబా, మంగళవారం నాడు చచ్చిన పాము నోటిలో కొన్ని ప్రత్తిగింజలు బెట్టి భూమిలో నాటిన కల్గు ప్రత్తిచెట్టు నుండి లభించు ప్రత్తితో వత్తులు జేసుకొని, వానిని ఆముదములో దడిపి ఒక్కొక్క వత్తిని దీపముగా వెల్గించిన ఆ కాంతిగల ప్రదేశమంతయూ పాములు పాకాడుచున్నట్లు కాన్పించును.



18. ఇల్లంతా పాములా :

ఆముదము, జమ్మిపూవు (శమీ) పాముపొర (కుబుసము) కప్ప క్రొవ్వుతో దీపములు వెల్గించిన మందిరమంతయును పాములా! అనిపించును.

19. మందిరం వృశ్చికమయం :

పద్మావతీదేవీ! తేలు ముఖమున ప్రత్తిగింజలుంచి భూమిని నాటిన కల్గు కార్పాసము (ప్రత్తి) చే వెల్గింపబడిన దీపపుకాంతికి ఇల్లంతా తేళ్లున్నట్లుండును.

20. ముంగిసల మయము :

శుకమహర్షి తపముచే ప్రత్యక్షమైన ఓహిరణ్యాననా! పై యోగముల వలెనే ముంగిస శిరముచే గృహమంతయును ముంగిసల వలె కాన్పించునట్టి కౌతుకమును చూపవచ్చును.

21. కోరిన వాటిని చూపుట:

సప్తపర్వత రాజ్యశ్రీ! ఊడుగగింజల వలన కామరూపము కల్గును, ప్రత్తిగింజల వలన ఏ జంతువు-పక్షి, శిరముతో కల్పింపబడిన దూదివి ఉపయోగించిన దీపకాంతి ఆ జంతు రూపమును కాన్పింపజేయును.

22. అంకోల బీజ మహిమ :

రాజ్యలక్ష్మీ! ఊడుగింజల మహత్యంబింతింత యనరాదు. దేవీ: కౌతుక కామవిద్యల కాధారము అంకోల బీజము సుమా! ఊడుగగింజలు పండి నేలను పడును. చెల్లాచెదురుగా నాల్గు మూలలా పడియున్న ఈ గింజలన్నియూ, ఒక్క మెఱుపు ఉఱుము కల్గినచో వృక్షమునకుపోయి అంటుకొనును. ఇంత సజీవాకర్షణ మేవృక్షమునకును లేదు. పద్మా! అందువల్లనే "జీవజ్యోతి" ఊడుగ యందురు.

4 శంకరుని రూపు

"లక్ష్మణాగ్రజా! మారేడు ఆకులు, కృష్ణసర్పము క్రొవ్వు, వృషభముయొక్క రోమములు, గంధకము, మణిశిల; ఈ వస్తువులను సమభాగములుగా మర్దించి, నుదుట తిలకము ధరించినచో వాడు ఇతరులకు ఈశ్వరునివలె కాన్పింపగలడు.

5 బ్రహ్మరూప ధారణ :

దశరథనందనా! తెల్లని పూవులు గల బ్రహ్మవృక్షమను పెద్దగోలుగు పూలు, మణిశిల, అశ్వగంధ, వెన్న కలిపి నూరి తిలకము ధరించిన వారితరులకు బ్రహ్మవలె కాన్పింతురు.

6. పంచముఖేశ్వర రూపధారణ :

కౌసల్యా సుప్రజా రామా! ఏ గోవు చచ్చిన దూడను ప్రసవించునో, ఆ చచ్చిన దూడ హృదయ మధ్యమమున పచ్చిపసుపు దుంపను బెట్టి భూమియందు పాతి, దానికి ప్రతిదిత్యము మేకపాలు నీరు పోయుచుండవలెను. ఆ దుంప చెట్టుగా మారి, దుంప పెరిగిన తర్వాత, తెల్లమురిపిండి హరిదళము సమభాగములుగా కలిపి మర్దించి శరీరమునకు పూసుకొనిన వారలు ఇతరులకు ఐదుతలలు మానవులవలె కాన్పింతురు.

7. కోరిన జంతువు రూపమును బొందుట :

నీలమేఘశ్యామా! రామా! కోరిన జలచర - స్థలచరముల రూపు నంద దలచిన వారలు, ఆ జంతువులను జంపి, వాటి ముఖ మధ్యము నందు ఊడుగవిత్తును బెట్టి భూమిలో పాతవలెను. ఈ విత్తు మొలచి, చెట్టు పెరిగి కాయలు కాచిన తర్వాత; ఆ కాయలలో ఒక కాయను త్రిలోహ తావీజున ధరించవలెను. త్రిలోహ



తావీజు అనగా బంగారు 10, వెండి16, రాగి 12, భాగములుగా కలిపి చేసినది.

7. సింహరూప ధారణ :

చనిపోయిన లేక చంపబడిన సింహ ముఖమున ఊడుగ గింజను ఉంచి 6 వ యోగములోవలె చేయవలెను. ఆ తావీజును నోటిలో ధరించిన, తాను ఇతరులకు సింహమువలె కాన్పించును. తావీజు తీసిన యధాప్రకారముగా నుండును.

8. వ్యాఘ్ర రూపము :

కోదండపాణీ! 7 వ యోగమే దీనికి గూడ ఆచరింపదగినది.

9. గజ రూప ధారణ :

కమలలోచనా! గురువారము నాడు చచ్చిన ఏనుగు ముఖమున ఊడుగు విత్తునుంచి 7వ యోగములోవలె చేయవలెను.

10. అశ్వ రూపము

తాటకమర్దన దాశరథీ! ఆదివారము చచ్చిన గుఱ్ఱము ముఖమున ఊడుగ విత్తును పాతి 2వ యోగములో వలె సాధింపదగును.

11. వృషభ రూపము :

10 వ యోగమువలెనే ధనుర్ధరా!

12. మృగ రూపము :

రాఘవేంద్రా! లేడి శిరమున పై వలెనే చేయవచ్చును.

13. శునక రూపము

కోసలేంద్రా! చచ్చిన శునకము ముఖముతో పై యోగము వలెనే చేయవచ్చును.

78. తెల్లగురిగింజలు వశీకరణకు పెట్టిన పేరు. వశీకరణ ప్రక్రియలలోకెల్ల నుత్తమోత్తమ ప్రక్రియనుటలో అసహజము లేదు.

79. మంజిష్ఠ (పసుపు) కుంకుమపూవు, అజామోద మన బదు వాము, కలబంద రసంతో నూరి చితాభస్మం కలిపి గోలీలు చేయవలెను. ఈ ప్రక్రియ పుష్యమీ నక్షత్రములోనే చేయవలెను. ఈ మాత్రను, ఆహారపానీయాదులలో కలిపి యిచ్చినచో వశ్య మగుదురు. దీనిని చూర్ణముచేసి ఎవరి నెత్తిపై జల్లినను, లేక ఆ గోలీలను తాకించినను, వారలు వశ్యమగుదురు.

80. చంద్రగ్రహణకాలంలో శ్వేత అపరాజితము వేరును దెచ్చి ఆహార పదార్థములలో కలిపి తినిపించినచో వశీకరణ ప్రాప్తి కాగలదు.

81. భరణీ నక్షత్రంలో ఉసిరిక వేరు, విశాఖ నక్షత్రంలో మామిడివేరు, పుబ్బా నక్షత్రంలో దానిమ్మవేరులను దెచ్చి ఈ మూడింటినీ పుష్యమీ నక్షత్రంలో ఏకం జేసి దండనుధరించినచో సర్వే సర్వత్ర రాజపూజ్యత, ఆఫీసులలో, కోర్టులలో విజయము కలుగును.

82. ఆశ్లేషా నక్షత్రంలో నాగకేసరమువేరు దెచ్చి చేతికి ధరించిన, రాజాధిరాజులైననూ వశమగుదురు.

83. రాత్రికాలంలో మేకరక్తంతో తెల్లావాలు తడిపి రాజు పేరుతో పదివేలు హోమము చేసిన రాజు వశమగును.

84. తెల్లావాల పూలను తేనెతో కలిపి, రాత్రియందు రాజ వశీకరణకు పదివేలు హోమము చేసిన మనోకామము సిద్ధించును.

85. గోరోజనం, సహదేవీవేరు నూరి లలాటంబున తిలకము ధరించిన సర్వ జీవ వశ్యమగును.



86. మేడివేరును గోరోజనమును తిలకము ధరించిననూ, సర్వజన వశ్యమగును.

87. 89వ యోగమును తాంబూలముతో తినిపించిననూ వశీకరణ మగును.

88. దేవదారు, తెల్లావాలు మర్దించి గోలీలు చేసి పుక్కిట నుంచుకొని ఎవరితోనైననూ,మాట్లాడుచో,అ ఎదురు వారలు వశీభూతులగుదురు.

89. కుంకుమపూవు, తగరం, చెంగల్వకోష్ఠు, హరిదళం (శాళకం) మణిశిల, ఉంగరపు వ్రేలు రక్తముతో కలిపి నుదుట తిలకము ధరించిన అతని దృష్టి నుంచి ఏ జీవియు తప్పుకొనలేదు. అతనికి వశమై యుండును.

90. గోరోజనం, పద్మపత్రం, ప్రేంఖణము రక్తచందనము అన్నీ కలిపి కాటుక కంటికిపెట్టుకొన్న వానిని జూచిన వారెల్ల వశీభూతు లగుదురు.

91. తెల్ల గురివిందలు నీడలో ఎండించి నల్లఆవు పాలతో నూరి తిలకము ధరించిన సర్వలోక వశమగును.

సర్వగ్రహ పీడా నివారణము

92. జిల్లేడువేరు, ఉమ్మెత్త, ఉత్తరేణివేరులు, గడ్డి వేరు (దూర్వా) మఱ్ఱి, రావి, జమ్మి, వేరులు, జమ్మిఆకు, మామిడి ఆకు, మేడి ఆకులను ఆవు పాలు గల మట్టిమూత (పాత్ర) లో వుంచి నేయి పోసి, బియ్యం, పెనగలు, గోధుమలు, పెసలు, నువ్వులు, గోమూత్రం, తెల్లవాలు, దర్భ, చందనం కలిపి శని వారం సాయంకాలం రావిచెట్టు మొదట పెట్టి వచ్చిన సర్వగ్రహ పీడలడంగును. ఈ క్రింది మంత్రముతో ఈ పనిని చేయవలెను.

దానిని శిరస్సు, కంఠము, చెవికి, చేతులందు, బంగారు తాయెత్తులో భద్రపరచి ధరించిన వానిని, నిత్యము 1 పలము శుద్ధగంధకమును ఆవుపాలతో చేర్చి త్రాగిన వానికి ముసలితనము రాదు, చావులేదు.

127 వజ్రమణి

1. పాదరసము (ఆకర్షణశక్తికలిగినది) కాంతము, ముండ లోహము, అభ్రకసత్వము, మాక్షికసత్వము, వజ్రము సమాంశములుగా నిమ్మపండ్లచే సప్తాహం (7 దినములు) మర్దించి ఉండ జేయాలి.

2. వానిని, సింధూలవణము, తేనె, గోజిహ్వ (మూలిక) కాకి దొండల సమాంశములుగా నూరి 1వ యుండకు అంగుళము దళసరిగా కవచ మివ్వవలెను; దానిని వజ్రమూసలో బిగించి భూధరయంత్రమున 15 రోజులు పుటములు వేయవలెను - దానిని తీసి తిరిగి పుటము వేయవలెను. 5 పుటములకు మణియగును.

128 రసరాజమణి

30 తులముల సీసము/లేక వంగము (తగరము)ను జిల్లేడు పాలతో మర్దించుచూ 1 కర్షమెత్తు మిగులు వరకు పుటములు వేయవలెను. దాని తర్వాత అది ఎంతయూ తగ్గదు సీసము చేత చేయబడినచో నాగచపలము, తగరమున చేయబడినచో వంగచపలమందురు.

2. వంగ చపలము చేతికి పూసుకొని రసమును ముట్టినచో గోలీయగును. ఇది ధాతువాదోపయోగము.

129 భూనాగముద్రిక

భూనాగసత్వమునకు 8 రెట్లు బంగారు.చేర్చి కరగి దానితో



ఉంగరము చేసి ధరించిన;ఆ ఉంగరమును నీళ్ళతో కడిగి, ఆ నీరును రాచినంతనే స్థావర-జంగము విషప్రమాదములు సూతికా గ్రహ, నేత్ర, కర్ణ, మూల, శూలబాధలు పోవును.

130 తుత్థముద్రిక

మైలతుత్థ సత్వం, భూనాగసత్వం సమముగా కలిపి ఉంగరమును చేసి దానిని తాకినంత మాత్రముననే శూలలడంగును.శాకినీ, డాకినీ గ్రహాది, స్థావర జంగమాది విషంబు లడంగును దీనిని ధరించిన గర్భిణీ స్త్రీ సద్యోసుఖ ప్రసూతయగును.

131. సుఖప్రసూతిమంత్రం

"రామవత్సరసేనాని ముద్రితేపి తథాక్షరం
హిమాలయోత్తరదేశే అశ్వకర్ణోమహాద్రుమః
తతశ్శూలం సముత్పన్నం తత్రైవ విలయం గతః"

ఈ మంత్రంతో 7 సార్లు మంత్రించాలి.

132 వెండి చేయుట

గౌరీ పాషాణమును నూరి అడవిపంది కొవ్వులో దీపాగ్నికి వండిన పాషాణము మైనము రీతిగా యుండును. దానిని 2 గుంజలఎత్తు; తులం తగరంలో కరిగి వేయగా రజిత మగును.

133 వెండి

తాళకం, ఇంగిలీకము, రసము, సమభాగాలుగా నల్లమదిపట్టరసంతో, 1 రోజు మర్దించి, బిళ్ళజేసి పుటము వేయగా భస్మమగును. ఆ భస్మమును కరగించిన రాగిలో వేయగా రజితమగును.

మంత్రము :

66. ఓం నమః ఆదిపురుషాయ (అముక = పేరు) స్వా కర్షణం కురుకురు స్వాహా॥

67. నల్ల ఉమ్మెత్త ఆకుల రసంలో గోరోజనము కలిపి గన్నేరు పుల్లతో భుజపత్రిపై మంత్రమును "కావలసినవారి పేరు చేర్చి" వ్రాయవలెను. దానిని చంద్రకట్టెల నిప్పుపై కాల్చిన నూరు యోజనములందున్న వారైననూ; నిస్సంశయముగా ఆకర్షింపబడి రాగలరు.

68. అనామిక(ఉంగరపు)వ్రేలు రక్తముతో భుజపత్రి (ఇది ఎండిన అరటి ఆకువలె సన్నని కాగితంలా ఉంటుంది) పై మంత్రము, పేరుతోగూడా వ్రాసి, దానిని తేనెలో వేసి ఉంచినచో స్త్రీ లేక పురుషులైనా అత్రముతో గూడిన వారలై ఆకర్షింపబడుదురు; అనగా శీఘ్రముగా రాగలరు.

వశీకరణ ప్రక్రియలు

69. బ్రహ్మదండి, వస, చెంగల్వకోష్టులను చూర్ణించి ఆదివారము రోజున ఎవరికి తాంబూలంలో తినిపింతురో;వారు వారెట్టి కఠినులైననూ, తినిపించిన వారలకు వశమైయుందురు.

70. నీళ్లతో మఱ్ఱివేరును నూరి విభూతి కలిపి ముఖమున బొట్టుగా ధరించిన వానిని చూచినవారెల్లరు ఆతనితో ప్రీతిగలిగియుందురు.

71. పుష్యమీ నక్షత్రమున తెల్ల గలేరును దెచ్చి ఓం నమః క్లీం క్లీం సర్వలోకవశంకరాయ సద్యోవశ్యం కురుకురు స్వాహా॥" అను ఈ మంత్రముతో 28 సార్లు మంత్రించి, హస్తమందు త్రిలోహ తాయీజున ధరించిన సర్వంజన వశీకరణంబగును. సర్వత్ర గౌరవ మందును.

72. ఉత్తరేణివేరును నల్లని ఆవుపాలతో మర్దించి గోలీయ చేసి యుంచుకొనవలెను. ఆ గోలీని వశీకరణ మంత్రముచే 128 పర్యాయములు మంత్రించి, దానిని సానపై అరగదీయుచూ "క్లీం" కారీ సకల వశ్యం కురుకురు స్వాహా" అని తలంచుచూ దానిని నొస్టన తిలకముగా ధరించిన త్రిభువన జనంబులు వశంబులగుదురు.

73. కుంకుమ, రక్తచందనం, గోరోజనము, పచ్చ కర్పూరము సమభాగములుగా నల్లని ఆవుపాలతో నూరి, దానిని 1108 పర్యాయములు "ఓం క్లీం సః అముకం (పేరు) మే వశం కురు కురు స్వాహా॥" అని మంత్రించి. తిలకము ధరించునప్పుడు 27 సార్లు జపించిన, అధికారులు, పెద్దలు వశీకరులగుదురు. కోరిన వారి పేరున చేసినప్పుడు వారుగూడా వశమైయుందురు.

74. సహదేవిచెట్టు సమూలం తెచ్చి, నీడన ఎండించి, చూర్ణము చేసి, ఆ చూర్ణమును 23 వ మంత్రముతో మంత్రించి, తాంబూలంలో ఎవరికి తినిపించిన వారలు వశ్యమగుదురు.

75 ఓం అం హ్రీం క్రోం* ఐం క్లీం సౌః సహస్రార హుం ఫట్ స్వాహా" 10 వేలకు సిద్ధి.

76. "ఓం అం ఐం హ్రీం క్లీం క్రోం సుదర్శనాయ హుం ఫట్‌స్వాహా॥" 10 వేలకు సిద్ధి

77. హస్త ఆదివారం రోజున తంటెపు వేరును తెచ్చి దండన ధరించిన సకల జన వశీకరణంబగును. దీనికి ముందుగా పైరెండింటిలో దేనితోనైనా ముందుగా ఒక వేయితో అభిమంత్రింపవలెను.

# శుభఫల ప్రదీపిక

ఈ క్రింద కొన్ని నక్షత్రములు ఏ ఏ పనులకుపకరించునో వానిని పొందుపరచితిమి. పంచాంగము చూచిన ఆ నాటి నక్షత్ర వివరములు తెలియగలవు. ఇతరములకు "నక్షత్రచూడామణి" చూడుడు

వైద్య విద్యా - గారుడ విద్యారంభమునకు.

హస్త, చిత్త, స్వాతి: అనూరాధ, పునర్వసు, శ్రవణం, ధనిష్ట, శతభిసం, మూల, రేవతి. అశ్విని, జ్యేష్ట, ఆశ్లేష, ఆరుద్ర, మృగశిరా నక్షత్రములు. ఆది, సోమ, మంగళ వారాలు శుభము. జ్యేష్ట గారుడవిద్యకు పనికిరాదు.

పుష్యమీ నక్షత్ర ప్రభావము :

పాపగ్రహక్రాంతి, లిప్తమాత్రం వేధకలిగిన, క్షీణచంద్రుడైనా, తారాబలంలేకున్నా, పెండ్లితప్ప మిగిలిన సర్వకార్యములు చేయవచ్చును. చంద్రుడు చెడ్డగాపున్నా పుష్యమీ శుభకరము. మృగములలో సింహము, మంత్రములలో నృసింహము, నక్షత్రములలో పుష్యమి శ్రేష్ఠము. ఆదివారం పుష్యమి, పుష్య మాసంలో పుష్యమి (పూర్ణిమ) సూర్యుడు చంద్రుడు పుష్యమీ నక్షత్రములలో యున్న (పుష్యమికార్తె) చాలా శుభకరము.

వీరభేతాళ సాధనకు :

మఘ, ఆరుద్ర, భరణి, మూల, మృగశిరలు, తుల కుంభలగ్నములలో, అష్టమశుద్ధి (ఏ గ్రహం ఉండక దృష్టి యుండక యుండవలెను) గల, నాల్గవస్థానమగు కేంద్రమున శుక్రుడుండగా వీరభేతాళాదుల సాధింప వలెను.



మంత్ర గ్రహణం :

సూర్యుడున్న నక్షత్రం నుంచి 3 నక్షత్రములు 14 నుండి 4 నక్షత్రములు, 20 నుండి 7 నక్షత్రములు శుభకరము.

మంత్ర యంత్ర వ్రతాదులు :

ఉత్తర, హస్త, అశ్విని, శ్రవణ, విశాఖ, మృగశిర నక్షత్రములు గల ఆదివారములు చాలా మంచివి.

దీక్ష :

రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రపద ఉపనయనమునకు చెప్పబడిన నక్షత్రములు. గ్రహణకాలములలో మంత్ర స్వీకరణ, ఆగమోత్తమదీక్ష తీసుకొనుటకు మంచిది.

రస సేవన :

హస్త, చిత్త, స్వాతి, అశ్విని, పుష్యమి అనూరాధ, రేవతి, శ్రవణ, ధనిష్టి, శతభిషం, పునర్వసు, మృగశిర ఆది, మంగళ, గురువారాలు శుభము.

గజ కృత్యము :

శ్రవణ, ధనిష్ట, శతభిషం, హస్త, చిత్త, స్వాతి, రేవతి, అశ్విని, మృగశిర, పుష్యమి, అనూరాధ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పునర్వసు, చతుర్దశితిధి, శుభ వారాలు ప్రశస్తము.

సూర్యుడు ధనుర్మీనములలో (మార్గశిర ఫాల్గుణములలో) యుండగా, శుక్లపక్షంలో, మంగళ శనివారాలు, రాత్రి, హరిశయన దినములలో ఏనుగునకు దంతచ్ఛేదన చేయరాదు.

మాత్రమున మర్దించి ఎలుకకు పూసిన; దానిని చూచి ఇతర ఎలు
కలు పారిపోవునే!

49. పక్షులు-ఎలుకల-బంధనములు:

స్తంభన విద్యకు బగళవుగా విఖ్యాతి నందితివి. ప్రతి అవ
తారమున నీవు నాతోగూడ నుండువు ఆది శ్వేత యజ్ఞ వరాహ
మూర్తిగా నుండ, నీవు వారాహీదేవిగా నుండువు. కలికాలమున
"వేంకటేశ్వర రూపమెల్లో; అల్లే వారాహీదేవి ప్రభావముండును.
రత్నేశ్వరీ! శత్రు శిర విచ్ఛేదనకరీ! వైష్ణవీ! వినుము.

మఘ నక్షత్రములో విష్ణుమోదకమను చెట్టు వేరు తెచ్చి
ఏ క్షేత్రము (ప్రదేశము) న యుంచిన, అక్కడకు వచ్చు ఏ ప్రాణి
కైనా ముఖబంధన యగును. పక్షులు-మృగములు-ఎలుకలు వచ్చి
ననూ; అవి ఏ పదార్థమును నోరుతెరచి తినలేవు పంట భూములలో
యుంచిన పంటలను; పురుగులు-పక్షులు-ఎలుకలు తినవు. చైత్రంలో
ఆదివారం, పుష్యమీ నక్షత్రంవచ్చిన రోజున ఈ వేరును దెచ్చిన
వానికి ఎలుకలు భయపడును. వాని వశ్యమగును. వాటిని కడు సుల
వుగా పట్టవచ్చును.

50. మత్కుణ విదారణ (నల్లుల హరణ)

ఓ ప్రియతమా! నడుముకు నాచు మొక్క వేరును ధరించి
రాత్రి శయనించిన శయ్యాపైగల నల్లులన్నియు పారిపోవును-
అథవా ఉన్నచో చచ్చిపోవును.

51. 'రోహిషతృణ పుష్ప' అనబడు తూరీగ గడ్డి, పువ్వు
ఎండించి ధూపముచేసిన నల్లులు-పేలు ఆ వాసనకు చచ్చిపోవును.

52. జిల్లేడుకాయలతో వచ్చు దూదివి వత్తిగాజేసి, లక్క
(లత్తిక) తో భావనజేసి కర్పూర తైలంతో దీపము వెల్గించిన
పేలు-నల్లులు నశించును.



53. మద్దికాయలు, పువ్వులు, రక్తచందనము, గుగ్గిలం,
తెల్లవిష్ణుక్రాంత వేరు, నల్లజీడి, వెదురు,గుగ్గిలం, సీమ సాంబ్రాణి
అన్ని కలిపి ఉండ జేసి ఏ ఇంటియందు ధూపము వేయుదురో;
ఆ ఇంటి యందు పాములు, తేళ్లు, నల్లులు, ఎలుకలు నశించును.

54. తుంగముస్తలు, తెల్లావాలు, నల్లజీడి, పిల్లేంద్రము
కాయలు, బెల్లము,జిల్లేడుకాయల చూర్ణం, సీమ సాంబ్రాణి అన్ని
కలిపి ధూపము వేసినచో ఇంటియందలి వివిధపురుగులు, ఎలు
కలు, పేలు, నల్లులు, దోమలు పారిపోవును.

55. నల్లుల పలాయనం

రేలకాయలను మంచమునకు కట్టినచో పరుపు, మంచము
నందలి నల్లులన్నియు పారిపోవును.

56. ఖేలన బంధన

తాబేలుకు వరుసగా ఏడు రోజులవరకు హరిదళమును తివి
పించి. దాని మలమును చేతికి పూసుకొని నృత్యము, చేయువారల
ఎదుట నిలువబడినచో వారు స్తంభించి పోవుదురు.

57. శిరస్సు మండుచున్నట్లు జేయుట

సింధూరం, గంధకము, మనశ్శిలలను సమభాగములుగా
కలిపి బాగా నూరి,ఒక గుడ్డకు పూసి,దానిని శిరస్సున ధరించినచో
శిరస్సు మండుచున్నట్లుండును.

58. ఆకలి-దప్పిక లేక యుండుట

కృకలాలము (తొండ = ఊసరవెల్లి) కోరలు, హృద
యము, కానుగ విత్తులు నూరి మాత్రలుచేసి ఆ మాత్రలను
త్రిలోహ తావీజున ధరించిన వారలకు ఆకలి-దప్పి యుండదు.

23. తైల ప్రయోగము :

హృదయేశ్వరీ! పద్మా! ఊడుగగింజల నూనెలో ఏ గింజ
నైనా నలుబది దినములు నానబెట్టి తుడిచి, దానిని భూమియందు
పాతి, నీరు జల్లిన కాలముగాని కాలములో నైనా అలభ్య పుష్ప,
ఫలభర వృక్షములనైనను జూపవచ్చును

24 తైలము దీయు విధానము :

అందాలరాణీ! ఊడుగగింజల నూనెను దీయుట కుపాయ
ముండవలెను. పద్మా! గానుగలో వేసిన గానుగలు ఆడవు సుమా!
ఆముదములు వండినయట్లు తైలమును సంపాదించవచ్చును. గింజ
లను గొట్టి, డిప్పలను వేరుబరచి, లోపలి పప్పును రుబ్బిన ముద్దను
మూడు ప్రయోగములలో దేనితోనైనా తైలగ్రహణము చేయ
వచ్చును.

1. వ ప్రయోగము : ఒక సిబ్బికి ఈ ముద్దను బెట్టించి
గిన్నెపై బెట్టి పైన విప్పులుంచి ఊదినచో క్రిందిగిన్నెలో తైలము
స్రవించును. అయితే క్రిందనున్న గిన్నె మాత్రము భూమిలో నీటితో
తడుపుచూ చల్లగా నుండనిచో ఆ గిన్నె వేడికి తైలము ఆవిరియై
పోవును

2 వ ప్రయోగము: ఆ ముద్దను నీటిలో కలిపి బాగుగా సల
సల కాచిన పైన నూనె తేలును. ఉపాయముగా దానిని గ్రహింప
వలెను.

3 వ ప్రయోగము : ఒక ఉక్కు ముక్కకు ఈ పిండిని
యుంచి ఎఱ్ఱని ఎండలో ఉంచవలెను. కత్తి మంచిది. ఆ కత్తి
చివర చల్లని గిన్నెలో యుండవలెను. ఎండవేడికి ఆ ముద్దకరిగి
తైలము గిన్నెలో చుక్కలు చుక్కలుగా బడును. తైలము ఈవిధ
ముగా లభించునేగాని అన్య విధానమున లభింపదు.



దేవీ! మంగాపుర సామ్రాజ్ఞీ! ఊడుగగింజల నూరిన ముద్దను
నువ్వుల నూనెలో 40 దినములు నానబెట్టి వండినచో ఊడుగతైల
మగును.

25. కోరిన వృక్షమును పుట్టించుట :

పై తైలమున ఏ గింజను నానబెట్టి ఆ గింజను భూమిపై
నాటి నీరు జల్లిన ఆ వృక్షము ఫల పుష్పములతో జనింపగలదు.

26. మామిడిపండ్లు :

నోటికి తగలని మంచి మామిడిటెంకను ఊడుగ తైల
మున నానవేసిన దానిని భూమియందు పాతి నీరుజల్లిన ఫలభరిత
వృక్షము జనించును. ఫలములను కోసి భుజింపవచ్చును!
పద్మావతీదేవీ!

27. తామరపూలు :

పద్మావతీ! తామరపూవులో జన్మించిన ఓ రమణీమణీ!
తామరగింజలు ఊడుగనూనెలో నానబెట్టినవి భూమియందు పాతి
జలప్రోక్షణ మొనరించిన క్షణమాత్రమున తామరలు జనించును
కమల నయనా!

28. మృతమానవుడు సజీవియగుట :

అలమేల్మంగా! అప్పుడే చచ్చిన వారి శవము ముఖమున
ఒక్క ఊడుగతైల బిందువును వేసినచో, ఆ శవము తిరిగి ప్రాణ
మునుపొంది, మాట్లాడును కానీ తిరిగి మృతిని బొందును. మరణ
రహస్యము ఎవరికినీ తెలియరానిది. ఆ శవమును ఊడుగగింజల
తైలమున యుంచిన ఆ జీవి కేనాటికినీ మృతి కలుగదు.

ఏ దేహముపై (శవముపై) ఈ తైలము పడినా అది
తిరిగి లేచి పునర్ మరణమందును.

## పంచమాధ్యాయము 5

పద్మా! ఈ అధ్యాయమున నానావిధ యోగములను తెలియ జేయుదును వినుము—

151 రంగు రంగుల పూలు బంగారు పూలు

తెల్లపూలు పూసే చెట్ల పాదులలో రుదసీలోధ్రం, ఎఱ్ఱ ప్రత్తిపూలు, మోదుగపూలు వేసి కాచిన కషాయము ప్రతిదినమూ చల్లుచున్న సువర్ణ పుష్పంబులు పూయును.

కలువగడ్డ నగం చీల్చి దానిలో కోరిన రంగుంచి దారంతో గట్టి దానిని నీళ్లున్న పాదులో ఉంచిన ఏ రంగుంచినామో ఆ రంగు గల పూలే పూయును—

152 తెల్లపూలు

దాసానిచెట్టు వేళ్లకు పాలు పోయుచుండిన తెల్లని పూలు పూయును.

153 ఎఱ్ఱపూలు తెల్లగా యగును.

చెట్టువేరులకు నెయ్యి పట్టించిన తెల్ల పూవులగును.

154 తెల్లవి ఎఱ్ఱవగుటకు

చెట్టువేరుకు తేనె పూయవలెను.

155 ఏరంగు కోరిన ఆ రంగు

ఏ విత్తులైనా ఏ రంగు వస్తువులలో నానవేసి, నాటిన ఆ రంగు నీళ్లు పోసిన ఆ రంగు పూలే పూయును.



156. ఫలపతనము

'ఉపిజరాయుజద్యోమ' మలను చేతికి పూసుకొని పండిన చెట్టు వ్రేళ్లు ముట్టిన ఆ పండ్లన్నియు రాలిపోవును.

156 A ఉలవలు ఉడికించిన వేడిసీరు చెట్టుకు పోస్తే పూలు-పండ్లు రాలిపోవును.

### సర్వనాశనము

157. కూడనిపని

ఎవరు తన ఇంటిలోగాని, భూమిలోగాని ఆవాలు చల్లిం చునో వారు తన పగవానిచే అవమానింపబడి, నిర్ధనుడై క్షీణించి పోవును—

158. అదృశ్యము

సర్పాక్షి, కచ్చూరాలు, తుంబీఫలము సమభాగాలు నీరు కలిపి చీల జేసి పుటముబెట్టి అంజన మిడిన అదృశ్యమగుదురు.

159. వాజీకరణ యోగాలి

ఇనుక చేపను నేతితో వండి తినిన నపుంసకునికి గూడా గొప్ప వీర్య స్తంభనయగును.

160. సాలెపురుగును దెచ్చి, దానంత తేనెతో నూరి బొడ్డుకు పూసిన నపుంసకత పోవును. వానికి చిత్రమూలమును పాలలో గాచి త్రాగించవలెను.

161. "నేతితో తడిపి చేయించి పగులగొట్టిన మినపప్పును పాలలో ఉడికించి నెయ్యి చక్కెర చేర్చి భక్షించిన వీర్యవృద్ధి యగును తిజే తిజే పిచ్చుకల రీతి సంభోగశక్తి కల్గును.

365. వంధ్యాకర్కోటకీ : (Momorndica dioicamate) దేవీ, కన్య, యోగీశ్వరీ, నాగహంత్రి, సర్పేషధి, భూతాపహ, కందవల్లీ, మహాయోగీశ్వరీ; విషమోహ ప్రశమనీ అను పేర్లు గలవు సర్పమదముల హరించును. విష, విసర్పిల తొలగించును. స్థావరవిషనాశనీ, పాదరసమును బంధించును. సర్పవిషహారిణి వ్రణహరి.

366. దేవదాళి దావరదంగి Bristly luffa శరీరము క్రింది- పై భాగములను శుద్ధి చేయును.విరేచనకారి-వాత వినాశని.

367 జలపిప్పలి : బొక్కెనాకు: పొన్నగంటి (Purple Lippa)వీర్యవర్ధని, నేత్రహితకరి, రసదోషహారి.

368. గోజిహ్వ : "గోభీ", ఎద్దు నాలికెచెట్టు, (Elephantopus-scabar) సర్వవిధవ్రణ-విషనివారిణీ.

369. ఈశ్వరీ : నాగదమనీ : (Artimusia Vulgaris). సర్వేసర్వత్రా జయము కల్గించును.ధనదాయకము, సుమతినిచ్చును రాక్షసభయ, గ్రహపీడ అన్ని విషములను హరించును.

370. నకఛికిని : (Centipeda orbicularis) గ్రహపీడ, భూతబాధ, దృష్టి దోషముల తొలగించును. ఈ చెట్టుక్రిందగల కందను వాసన చూచిన తుమ్ములు చాలా వచ్చును.

371. కుకురుందః (Blumea Odroreta) దీని పచ్చి వేరు ముఖమున యుంచిన ముఖరోగములు పోవును.

372. ఎలుకచెవి ఆకు: మూషకపర్ణి, వృషపర్ణి, శంబరీ, ద్రవంతీ, న్యగ్రోధి, భూచరి, శతమూలికా, సువర్ణీ (Ipomea Reniformis) పాదరసబంధనీ, రసాయనీ, మూషకవిషహారి.

373. మయూరశిఖ : (Cilosia Cristata) బాలగ్రహనాశని-వశీకరణ కర్మలలో గొప్పది.

374. కమలము: తెల్లనిది పుండరీకము, ఎఱ్ఱనిది కోకనద, నీలము ఇందీవరము- ఎఱ్ఱది శుక్రజనకము,నీలము బాలలకు వృద్ధికల్గించును దేహమును దృఢత నందించును.

375. పద్మినీ: మూలము, నాళము, ఆకు బీజాదికముగల సమూలము పద్మిని. స్తనములకు దృఢతనిచ్చి గట్టిపర్చును. (నాళమును పద్మిని యందురు.)

376 తామర కేసరాలు: గర్భములకు స్థిరత కల్గించును గర్భస్రావాదుల కానీయదు.

377. పద్మకంద: వీర్యవర్ధని.

378. గులాబీ (రోజ్ Rose) హృదయ ప్రియకరము, వీర్యవర్ధకము, ఉత్తమకాంతి కారకము, దాహశాంతి కరణి.

379. వాసంతి : దేవలత, వనవాసిని( Ixora parviflora నవమల్లిక: నేత్ర, కర్ణ, ముఖరోగాదుల నివారించును.

380. అడవిమల్లె : (Jasminum Argustifolium) సుగంధి, సుఖ,(కామదాయక)నూనెకిదే గుణము.

381. మాలతీ (జాజిపువ్వు) (Spanish Jasmine)

382. చమేలి. మస్తక-నేత్ర - ముఖ - దంత రోగహారి. పసుపు రంగుగలది. దంత శూల-కర్ణ శూలల నడంచును.

383. జుయి పుష్పాలు : (Jasminum auriculatum) శర్కరా రోగహంత్రి శిరో-నేత్ర-దంత-కర్ణ రోగారి.

384. రాజచంపకము (చాంపేయము-చంపా) (Michelia

29. ఖండ ఖండములుగా శరీరమును జూపుట :

అలికులవేణీ! తిరుమల మహారాణీ! వానాకాలంలో నెమలికి పురుగులను తినిపించి, దానిమలమును, ఆవుపేడ, మన్నుతో బాగా మర్దించి దేహమునకు పూసుకొనిన వారి శరీరమితరులకు ముక్కలు ముక్కలుగా కోసినట్లు కాన్పించును.

30. చచ్చిన చేప బ్రతుకుట :

నీలవేణీ! శ్రీఫల నివాసినీ! చచ్చిన మీనుకు జీడినూనెపూసి నీటియందు వేసిన అది నీటిలో జీవించును సుమా!

31. సూర్యచంద్ర గ్రహణంబులు :

వారాహక్షేత్ర నివాసినీ! సర్వసంపదల నిచ్చు భూదేవ్యంశ సంభూతురాలవగు ఓ పద్మా! అద్దము వెనుక భాగమున "కృకలాలము" అనబడు పురిడిపురుగు అనబడు తొండర క్తమును పూసి, ఎత్తుప్రదేశమున దాని నుంచి దాని యందుజూచిన సూర్య-చంద్ర గ్రహణములు కాన్పించును. పగలు సూర్యబింబమువలన సూర్య గ్రహణము రాత్రి చంద్రబింబమువలన చంద్రగ్రహణము కాన్పించును. ఆ అద్దము సూర్యచంద్రుల కాంతి నందవలెను సుమా!

32. మిట్ట మధ్మాహ్నం రధమున సూర్యుని గాంచుట :

ఓ తిరుమలరాణీ! దబ్బ (గింజల) నూనెను శుభ్రమగు రాగి పాత్రకు పూసి, మిక్కుటమగు ఎండలోనుంచి నిదానముగా జూచిన రధముతో ప్రకాశించు సూర్యుడు గాన్పించు నహో!

33. పగలే నక్షత్రముల జూచుట :

"కోద్రవ" అనబడు "అళ్లు" అనే ధాన్యపు పైపొట్టు,ప్రత్తి కలిపి చేసిన వత్తిని నూనెయందు దడిపి రాత్రియందు వెల్గించి



(2)

కాటుకబట్టుకొని దానిని కళ్లకు పెట్టుకొని చూచిన పట్టపగలే నక్షత్రములు కాన్పించును భద్రవతీ!

34. రాగిని వెండిగా మార్చి చూపుట :

ఓ పద్మావతీదేవీ! అరటిదుంపల రసముతో గంధకమును కలిపి రాగి పాత్రకు పులిమిన వెండిపాత్ర వలె కాన్పించును సుమా!

35. నీరు పాలుగా మారుట :

అనంతగుణ కల్పవల్లీ ! శ్రీదేవీ! జిల్లేడుపాలు, మర్రిపాలు బొడ్డచెట్టు (మేడి)పాలు కలిపి పాత్రకు పూసి ఎండించి దానిలో నీరుపోసిన జలము పాల వలె కాన్పించును.

35. మూత్రముతో దీపము వెల్గించుట :

దేవీ! పూర్వమందు వేదవతివి నీవు. రావణుడు నిన్ను అపహరింప సంకల్పింప అగ్నిన దూకితివి. నీ కోర్కె దీర్ప నీవే సీతవై లంకలో యుండుటకు అగ్నిదేవుడు రహస్యముగా నిన్ను మాయసీతగ జేసి నా కడ నుంచెను. నిజమగు సీతను తనయందు దాచెను. రావణ వధా నంతరంబు నీవు అగ్నిగర్భమందుండి నేడు ఆకాశరాజ నందినివైతివి. నీకు అద్భుత చమత్కారజ్వాలా వృత్తాంతము విన్పించెద వినుము.

ఏ మానవుడు మూడు దినములు నువ్వులు, అవాలు భుజించుచూ నాల్గవనాడు మూత్రించునో, ఆ మానవుని మూత్రమున వత్తిని వేసి వెల్గించిన ఆ మూత్రము తైలము వలె మారి దీపకాంతి నిచ్చును సుమా!

37. అగ్ని స్తంభనము :

ఓ శుకపుర పుణ్యశీలా! పద్మా! ఆదివారం రోజున తెల్ల గన్నేరు వేరును దెచ్చి కుడిచేత ధరించిన అగ్నిబాధింపదు సుమా!

353. ఇప్పను అశ్లేషలో దెచ్చిన వ్యాఘ్రాది క్రూర భయము లుండవు.

354. మోదుగ : హస్తములో తల - చేతికి ధరించిన క్రూర వ్యాఘ్రాదిమృగ, దుష్టగ్రహరాక్షస బాధలుండవు.

355. బదనిక : బదనిక యనునది చెట్టు చివరి భాగంలో సూచన గలది.

355 A. నిమిషములు మాత్రమే అచ్చట నుండును. "వృక్షాగ్రేతిష్టంతి ముహూర్త మాత్రం సంస్పర్శనాద్భవేత్బదనికా" యనగా అర్థము సులభసాధ్యము-ఆ నక్షత్రకాలంలో తాను చూచిన 24 నిమిషముల కాలప్రమాణమగు ముహూర్తములో, తాను దానిని తాకగా "బదనిక" యగును. "తెర" "పలుకు" యను అర్థముగల పదమే "వదనిక" "బదనిక" యని నా స్వానుభవమున గ్రహించినదే సత్యము. ఇతరములట్లు గాదని గ్రహించుటలో భావార్థమింత యోజింపతగిన ఇంగితమే ప్రధానమని గ్రహింతురుగాక-

356. పిండిచెట్టు : (Laico pedium) వటపత్రి అంటారు. బలవర్ధకము, మూత్రయోనిరోగ నివారిణి.

357. శంఖపుష్పి : రత్నపురుష. (Evolvuluserecta) మేధాహితకరి, వీర్యవర్ధక, మనోరోగహారి, స్మృతి, కాంతి, ఆయు, బల వర్ధకము. రసాయనము. మూర్ఛ, భూత, అలక్ష్మి, విష బాధాహారకము. స్వరమునిచ్చి, మంగళకారకమై, గ్రహదోషముల నడంచును. తెల్ల పూలది మేధాజనకము, రసాయనము,



వశీకరణసిద్ధి. కిన్నెర స్వరము నిచ్చును. అన్నీ ఒకటే యన వచ్చును-

358. లజ్జాలు : మునుగుదామరము. గుబ్బంతంటాకు. శాఖమూలి-(చుయి - ముయి) (Mimosascusetiva) బ్లడ్ ప్రెషర్, అతిసార, యోనిరోగహారి - విపరీత లజ్జాలు అత్తపత్తి-అంటారు. పాదరసబంధని-నానా-ప్రకార చమత్కారముల ప్రదర్శించును. రసనిష్పత్తికరణి.

359 దుగ్ధికా : పినపాలచెట్టు (Euphrobia Hirta) గర్భదాయకము, మూత్రకారి, మలవిరోధిని, వీర్యవర్ధని.

360 నాగార్జుని : రెడ్డివారినానుబాలు, యోగిని; వీర్యవర్ధకము, గర్భస్థాపకము, ధాతువర్ధకము, పాదరసబంధిని.

361. నేల ఉసిరికె : (Phyllanthus Niruri) విషనాశనము, పుత్రదాయకము.

362 : బ్రాహ్మి : (Indian Pennywort) మేధాజనము, అవస్థాస్థాపకబుద్ధి - ఆయు, కంఠ సుందరత, హృదయబలముల నిచ్చును-ఆరు మాసాయి సేవించిన కవీశ్వరుడగును రసాయనము-ఉన్మాదనాశని.

363 తుమ్మి : ద్రోణపుష్ప : (Lancas Celoloalotuo) పక్షవాతము పోజేయును.

364. సూర్యభక్తా : ప్రొద్దుతిరుగుడుచెట్టు, (Sun flower) సువర్చలా : భూత, గ్రహపీడా, ఉగ్రశీత జ్వర నివారిణి రసాయని. కిన్నెర స్వరమిచ్చి, మూత్రరాయి తొలగించి, మూత్రకృచ్ఛ్రముల, కర్ణశూలల, విస్ఫోటకముల తొలగించును.

177. ముఖబాధా హరణీయము.

జీలకర్ర, ఏలకులు, ధనియాలు, తుంగగడ్డలు, నెల్లికాయల వరుగు వీటిని సమభాగాలుగా దాల్చిన చెక్క, చేర్చి నోట యందుంచుకొనిన ఉష్ణము, మంట, నోటి పుండ్లు, సున్నము ఇతరములచే పొక్కిన నిప్పుతో కాలిన ఇతరములగు బాధలు హరించును. భోజనమున పెసరపప్పు, నేయి సేవించిననూ నోటి బాధలణగును.

178. పటిక.

పటిక, వెలిగారం మెత్తగా నూరి నేతిలో కలిపి పూసిననూ, కొబ్బరి తురిమి తినిపించిన, కొబ్బరినూనె పూసిన బాధలడంగును.

179. గండమాలా హరణీయము.

సహదేవి వేరును ఆదివారమున దెచ్చి చెవియందు ధరించిన గండమాల హరించును.

180. గాంధర్వ కిన్నర స్వరణీయము.

అల్లము, కర్కాటకశృంగి, ములుగోరింటవేళ్లు, వస, వల్లారియాకు, బావంగాలు, ఏలకులు సమభాగాలుగా చూర్ణించి నీటితో సేవింపవలెను. మాఘ కృష్ణ చతుర్దశి నుంచి 14 రోజులు సేవించాలి.

181. వావిలి వేరు పట్ట చూర్ణమును మంచినూనెతో కర్షమెత్తు సమముగా కలిపి 1 నెల సేవించిన కిన్నెర స్వరము కలుగును.



(4)

182. స్వరభంగ హరణీయము.

ఉసిరిక పండ్లరసము పాలతో కలిపి పుచ్చుకొనిన స్వరభంగము పోవును.

183. పుష్పావరోధ హరణము.

చన్నచర్ల గడ్డ యను నాగేటి దుంప చూర్ణమును గాని, ఉత్తరేణి వేరు చూర్ణము గాని, వెట్టిపుచ్చ వేరు చూర్ణము గాని యోని యందుంచిన రజస్సు వెడలును.

184. గర్భనిరోధము.

కృష్ణచతుర్దశిన తీసిన ఉమ్మెత్త వేరు మొలయందుంచుకొని సంభోగించిన గర్భోత్పత్తి కాజాలదు. దాని వేరునుగాని దాని చూర్ణమునుగాని యోని యందుంచిన గర్భోత్పత్తి కలుగదు.

185. గర్భ పాతన.

8 అంగుళముల ఆముదపు ఆకు కాదను యోని యందుంచిన 4 మాసాల గర్భమైననూ పతనమగును.

186. చిత్రమూలమును, వావిలి యాకురసమున నూరి తేనెలో ఆ ముద్దనుంచి కర్షమెత్తు తినిపించిన గర్భస్రావమగును.

187. పాము కుబుసమును పుటములో మాడ్చి తేనెలో గలిపి యోని యందుంచిన మూఢగర్భంబు పట్టుదప్పి పడును.

188. జెముడు పాలను కొద్దిగా నెత్తిపై వేసిన మూఢ గర్భంబు పడిపోవును.

189. వెంపలి వేరును తలకు కట్టిన మూఢ గర్భంబు పతనమగును.

278. తిక్తజీవంతి: (విషముష్టి) విషబాధలు. నొప్పులు పోజేయును లేపనమున ఎలుక విషహారిణిగా గుణమిచ్చును.

279. పిల్లిపెసర : వీర్యవృద్ధి చేయును. అతిసారహారి.

280. కారుమినుములు : రక్త-వీర్యపుష్టి - బలవృద్ధికరణి. వాత నొప్పులు హరించును. వేడి తీయును. (స్త్రీ స్తనముల క్షీర వృద్ధి.) దేహకాంతి నిచ్చును. కేశముల పెంపొందించును-

281. అముదపువేరు : వీర్యజనకము,కపవాత శూలహారిణి.

282 జిల్లేడుపువ్వు: వీర్యవర్ధకము విషహారి వాతాదిశూల, మలలరోగహారిణి రక్తపిత్తహారి.

283. విశల్య (లాంగలీ) పొత్తిదుంప (Aconitum Ne. pelus) గర్భపాతనకు ముఖ్య ప్రక్రియ మూఢగర్భ, శుష్క గర్భాదులను లేపన మాత్రాన గర్భపాతన చేయును. వత్సనాభి యందురు. వేరు ప్రయోగింతురు.

284. అడ్డసరం : ఇది రాగిని వెండిగాను-వెండిని బంగారు గాను చేసినట్లే కఫ క్షయలదంచును

285. పెద్దవేప : వేసవేయి రోగాలకుమందు. ఎలుకవిషం హరించును. కుష్టుపోవును. బాలల రోగాలకు మంచి మందు బ్లడ్ ప్రెష్షర్‌కు దివ్యమైనది. రసాయనము-తగరమును వేపమానెలో కరగిపోసిన స్వర్ణకాంతి నందును-భూత బాధాహారి.

286 మునగ :

మునగాకు పసరు కంటిలో పిండిన తల,పార్శ్వనొప్పి తగ్గును. గింజలు పొడి చేసి నశ్యం చేసిన తలనొప్పి విస్పందేహముగా తగ్గును. వీర్యవృద్ధి. హృదయ హితకారి.



287 తెల్లదింతెన : విష్ణుక్రాంత : అపరాజిత (Indian Mazereyun) హృదయ బలవీర్య, స్మృతి-బుద్ధి బలము నిచ్చి నేత్రములకు మేలు చేయును. క్షయ-ఉబ్బిన వ్యాధుల, విషరోగ ముల నడంచును. కర్ణశూలహారిణి.

288. వావిలి : (Vitex Nigundo) నేత్ర హితకారి, కేశ ముల పెంపొందించును-స్మరణశక్తి కల్గించును. వాతనొప్పులణ చును. ముక్కు-వెంట నీరు కారు వ్యాధి, జ్వర, ప్రదరరోగారి, శరీరకాంతి పెంచును. రాగిలోని చిలుము తీయును మెత్తదన మిచ్చును. 11 పర్యాయములు రాగి కరిగి వావిలాకు రసమున పోసిన లక్కవలె కరుగును. వావిలాకులను పుస్తకములు, గుడ్డ లలో నుంచిన పురుగులు చేరవు. అనుభవ రహిత ధాతువాదజ్ఞులు "నల్లవావిలి" కావాలి అంటారు. అనుభవంలో రెండూ ఒకటే-

289. కరంజ : కానుగ (Pongamia glabra) యోని దోషహారిణి, నేత్ర హితకారి, ప్లీహదూరకరణి. శిరో రోగారి. వ్రణవాపు పోట్లు పోవును. క్యాన్సర్‌కు పెట్టింది పేరు. రసకర్మ లలో ధాతువాదంలో వాడ్తారు. దంతములకు బలమిచ్చును. అరు కజుపుల కానుగ వీర్యస్తంభిని.

290. శ్వేతగుంజ: (Bead root) తెల్లది ఎఱ్ఱ దానికన్న శ్రేష్ఠము. వేరు వశీకరణి, కేశముల పెంపొందించును. పేనుకొరు కుడు నశించును. నేత్రహితకారి. ఆకు-వేరు విషనాశకము. యక్ష- (రాక్షస-గ్రహ-పిశాచ-బాధాహారకము.) గింజ వాంతికారకము.మహా విషము వీర్యవృద్ధి కరణి.

హ్రూంహ్రూంకార రూపిణ్యై, జం జం జం జంభనాదినీ, భ్రాం భ్రీం భ్రూం భైరవీ భద్రే భవాన్యైతే నమోనమః

అం కం చం టం తం పం యం శం వీం జుం ఐం వీం హం క్షం ధిజాగ్రం ధిజాగ్రం త్రోటయ త్రోటయ దీప్తం కురు కురు స్వాహా॥

పాం పీం పూం పార్వతీ పూర్ణా ఖాం ఖీం ఖూం ఖేచరీ తథా, సాం సీం సూం సప్తశతీ దేవ్యా మంత్రసిద్ధిం కురుష్వమే। ఇదంతు కుంజకా స్తోత్రం మంత్ర జాగర్తి హేతవే। అభక్తేనైవ దాతవ్యం గోపితం రక్ష పార్వతీ। యస్తు కుంజిక యా దేవి హీనాం సప్తశతీం పఠేత్ న తస్య జాయతే సిద్ధి రరణ్యే రోదనం యథా॥

దీనిని వేయి జపించిన సిద్ధియగును. ప్రతి శుక్రవారం 7 సార్లు పారాయణ నిత్యం 11 పర్యాయములు పఠించిన సర్వమంత్ర యంత్ర తంత్ర జాలాదికములు సిద్ధించును. సర్వవిధో పయోగమగును.

486. దుర్గాస్తుతి

శ్రీ దుర్గా దుర్గా ర్తిశమనీ దుర్గా పద్వి నివారిణీ,
దుర్గ మచ్ఛేదినీ దుర్గసాధినీ దుర్గ నాశినీ। 1
దుర్గతోద్ధారిణీ దుర్గ నిహంత్రి దుర్గమాపహా,
దుర్గమ జ్ఞానదా దుర్గ దైత్యలోక దావానలా॥ 2
దుర్గమా దుర్గమాలోకా దుర్గమాత్మ స్వరూపిణీ,
దుర్గ మార్గప్రదా దుర్గమ విద్యా దుర్గమాశ్రితా॥ 3
దుర్గమ జ్ఞాన సంస్థానా దుర్గమ ధ్యాన భాసినీ,
దుర్గమహా దుర్గమగా దుర్గమార్థ స్వరూపిణీ॥ 4
దుర్గమాసుర హంత్రి దుర్గమాయుధ ధారిణీ,
దుర్గ మాంగీ దుర్గమతా దుర్గమ్యా దుర్గమేశ్వరీ॥ 5



దుర్గ భీమా దుర్గ భామా దుర్గభా దుర్గ ధారిణీ।
నామావళి మిమాం యస్తు దుర్గాయా మయ మానవః।

పఠేత్ సర్వ భయాన్ముక్తో భవిష్యతి నసంశయః"

ప్రతినిత్యం 18 సార్లు పారాయణ చేసిన ఏ భయమూ కలుగదు.

487. కాట్రేరీ ప్రయోగం

ఓం నమో భగవతీ మళయాళ భగవతీ శక్తి సంహార లోక ఇస్మాకరీ। కాళ్ల కాళ్ల మేయక్కాల్। కన్నెకాట్రేరీ। కడుపు నొప్పి పెట్టవే। గర్భ కాట్రేరీ। పిల్లల చంపవే। పిల్లల కాట్రేరీ దానవ కాట్రేరీ। ఓం గర్భగోళం రం రం రం రం భగాభుగల్ శంభు శంభు జతుజ శక్తి। రం రం రం రం ర ర ర ర ఖెం ఖెం పగవారి ప్రాణంబులు తియ్యవే। ఎంతకట్టిన తుంచక। నా మంత్రంతో గర్భగోళమందు పొచ్చి తూలించి గర్రిక్కున తియ్యవే కాట్రేరీ। భం భం పం పం ఫటా ఫట్ హుం హుం హ్రూం హుం ఫట్ ఖట్ స్వాహా"

మూలం 5 వేలు సిద్ధి పనికి 108

488. చెప్పుదెబ్బల మంత్రం ఉచ్ఛిష్ట గణేశీయం

ఓం అస్యశ్రీ ఉచ్ఛిష్ట గణపతి శాబర మంత్రస్య మతంగ ఋషిః హ్రీం వ్ని భ్ర గాయత్రి చందః గణనాధన్ కో దేవతా గం బీజం గ్లాం హ్రీం శక్తిః

హస్తి ముఖాయ అం "హ్రా"
లంబోదరాయ తర్జ "శ"
ఉచ్ఛిష్టాయ మధ్య "శ"

తమ అభిమాన రచయిత

డాక్టర్. గుండు వేంకటేశ్వర రావు గారు



పూజ్యశ్రీ శ్రీ విశ్వామిత్ర



మా కుటుంబ
"ఉత్తముడు" "సహ
స్వర్గారోహణమున శ్రీ
ఆత్మశాంతికి ఈ మహ
మొనర్పబడినది.

114. పుష్యమిన పారవేరు, సర్పాక్షి వేరులను ఎఱ్ఱ దార మున గట్టి, పై మంత్రములో మంత్రించి, దానిని శిరమున ధరించిన కర్ణపిశాచి ప్రత్యక్షమై భూత భవిష్యత్తు కాలాదులు శుభాశుభములు చెప్పగలదు.

115. వివాదే విజయకరం

మార్గశిర పున్నమిన మయూరశిఖ వేరును చేతికి ధరించిన జయమగును.

116. మదర్శన వేరును శుభనక్షత్రమున ధరించిన విజయులగుదురు.

117. అజేయము—

ఉత్తరేణి సమూలరసం శస్త్రాస్త్రములకు పూసి ధరించిన వారలను రణమున జయించుట దుర్లభమగును. అతడు అజేయుడు—

118. సర్వత్రా విజయము

పుష్యమిన తెల్లగురివింద వేరును తెచ్చి కుడిచేత ధరించిన వారలకు సర్వే సర్వత్ర విజయము కలుగును.

119. వీరాధి వీరుడు

నల్ల కోడెత్రాచు శిరమున శవమృత్తిక నుంచి, దానిలో తెల్లగురివిందలు పాతిన అవి ఫలించి వృక్షమాయెనా! వాని గింజలు-వేరు వలనఅద్భుత ప్రక్రియలు గలవు. వేరును తిలకముగా ధరించిన వాడు యితరులకు 5 గురివలె కాన్పించును. వీరాధి వీరుడు కాగలడు.

120. స్తంభింప జేయుట

తెల్లి గురిగింజలు, మానవ పుఱ్ఱెలో నుంచి చెటు



3) మొలిపించి, ఆ చెట్టురసం ఎవరిపై చల్లిన వారు స్తంభించి పోవుదురు.

121 శ్వేతగుంజా (తెల్లగురిగింజ)

ఈ పై యోగములోని గింజలతో జపమాలను చేసి ఆ మాల చే ధరించిన వానికి సర్వేసర్వత్ర విజయమగును ఈ గుంజా మాలా ప్రభావము అనంతము.

శ్వేతగుంజా మాలాం సాక్షల్లక్ష్మీ ప్రదం: మంత్రితం చైవ కాళీ మంత్రేణ అనుసంధాన విధాన పూర్వకం తద్రూపం సాక్షాత్కా శక్తిః॥ లక్ష్మీ హృదయేన మహాలక్ష్మీ కటాక్ష్యంతి, అఘోరం సురూపం మంత్రితం మదఘోర ఘోరేన సంగ్రామే సంకటే పాశుపాత్యా బలం ప్రదర్శ్యతి. కటిం బధ్వా జన్మజీవ యోగ యోగేంద్రోవత్ జీవ స్తంభనం తధ్యం। పరం పరకువేదిం కుర్యాత్ శ్రీ మన్మంజీవేశ్వరీ ధ్యానేన పాతాళం ప్రత్యక్ష సిద్ధిదం॥ తారకేన సౌవర్ణకర్శతి హరిదళితం మిళితం, మహా ఘోరవిషం పలాయంతి-సర్వ కూర్ర మృగాదయః సాక్షాన్కాళ కాళీ కాశేయం తౌటిల్య భేదనం-ఛేదనం పరం జయంతి॥ దంత త్రాదనా స్త్రద యతి శత్రుః మర్దనార్థం భ్రామణం భ్రమరవత్ సంభ్రామ్య తత్యంత సుఘోరం వారాహో సద్య సిద్ధికరీ తత్కాలకం గుప్తం సప్రకాశ్యతి తద్దనం ధనం వసుంధరా హస్తేన పరిరక్ష్యతి॥ శ్రీ కృష్ణ-దేవం-దేవీద త్తం-సర్వ జాలమయం ధరణ్యేన యం యం చింతితం తంతం పూరయతి - దేనుర్ధరణి సుభోగే భోగ మాలిని సింహ విక్రమం మూర్తివంతం నృసింహం దత్తం తథా యథా సామ్రాట్ ద్విపేద్వ్యపిం భలేభలే దాతు॥ కరం ప్రత్యక్షం చతుర్గిరా ధర్మక్షేత్రం ధనధాన్య వివర్ధన కారకం.

త్రాగవలెను. 6 నెలలకు మునలితనము పోవును. ఆయువు పెరుగును.

## 171. హస్తికర్ణ కల్పము.

త్రయోదశీ సోమవారం నాడు బలురక్కసి యాకులు దెచ్చి నీడన ఎండించి చూర్ణించి, రోజుకు పలము వంతున ఆవుపాలతో నేవించిన ముదిమి నశించును- ఆయువు పెరుగును.

## 172. నిర్గుండీ కల్పము

పుష్యమీ ఆదివారం రోజున వావిలి వేరు పట్టను దెచ్చి నీడన ఎండించి చూర్ణించి నిత్య మొక కర్షము చొ॥ ఫలము మేక మూత్రమున నేవించిన 6 నెలలకు అమరుడగును. 1 సంవత్స రావికి శివుని యంత వాడగును. ఈ చూర్ణమును నేతితో 1 సంవత్స రము నేవించిన ఆ చంద్ర తారార్కమము జీవించును. వావిలి యాకు ఆచంద్రతారర్కమము జీవించును. వావిలి యాకు రసమును కుండలో బోసి సన్నని మంటచే బెల్లం పాగువలె వచ్చు రీతిగా గాచి దానిని త్రాగించిన వాంతి విరేచనములగును వాని శరీరమున యుండు పురుగు లన్నియు, నోరు-ముక్కు-కన్నులు- చెవులు మార్గము లలో వెడలిపోవును. క్షయ 7 దినములకు, కుష్టు 10 దినములకు పోవును- 3 మాసాలకు మునలితనము పోవును.

## 173. కనకశాల్మలీ కల్పము

కృష్ణాష్టమిన బూరుగవేరు పట్టను దెచ్చి నీడన ఎండించి చూర్ణించవలెను. ఈ చూర్ణమును పలము చొప్పున నేయి. తేనె



లతో నేవించిన ఆయువు పెరుగును. దీని పూలు దెచ్చి పాలలో వండి పూలను వదలి పాలను త్రాగవలెను. 1 నెలకు మృత్యువు పోవును దాని పండు నొక దానిని ఆవు పాలలో వండి పండును వదలి పాలను త్రాగవలెను. నాల్గుమాసాలకు వజ్రకాయుడగును. వాయు మనోవేగములు, బలము కల్గును. మల మూత్రములతో రాగి బంగారమగును. ఇంద్రియ స్థలనమునకు గొప్పక్రియ.

## 174. ముండీ కల్పము

శ్రావణ - పుష్యములలోని పూర్ణిమ రోజున గల శ్రవణ పుష్య నక్షత్రములలో లేదా రేవతి గల పూర్ణిమ దినమున బోడ తరము పంచాంగమును దెచ్చి నీడన ఎండించి చూర్ణించి, ఆవు పాలతో కర్షప్రమాణము నేవించిన సంవత్సరమునకు మునలి తనముండదు. ఆయువు పెరుగును మల మూత్రములు రాగిని బంగారుగా చేయును. ఈ చూర్ణమును ఆవు నేతితో నేవించిన బలము కలుగును.

## 175. వచా

సూర్య చంద్ర గ్రహణములలో వస దెచ్చి చూర్ణించి 7 రోజులు నేవించిల విశేష వాచాలత కలుగును.

## 176. దంత ధృఢీకరణము. *

తంగేడాకు, టెంకాయ రుబ్బిన పాలు, మంచినూనె పోసి (సమం) గాచిన నూనెతో పుక్కిలింపుచున్న మునలి వారలకైనా పండ్లు కదలవు.

భూతోచ్చాటనము :

ఉత్తిష్టంతు భూత పిశాచాః ఏతేభూమిభారకాః ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥ (అని అక్షింతలు వాసనజూచి వెనుకకు వేయవలెను అనగా "ఓం నమోభగవతే వాసుదేవాయ రక్షరక్ష" అంటూ)

ప్రాణాయామము :

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః :ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్. ఓమాఽపో జ్యోతీరసో అమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్" (అని గాలిని పీల్చి ఈ మంత్రం చదివేది.)

సూచన: సంకల్పమునకై ఈ క్రిందివి చూడుడు.

ఆయనములు 2.

మకరం నుంచి (జనవరి 15 నుంచి) ఉత్తరాయణం.
కటకం నుంచి (జూన్ 15 నుంచి) దక్షిణాయణం.

ఋతువులు 6. (ప్రతి 2 నెలల కొక ఋతువు)

| | |
|---|---|
| చైత్ర-వైశాఖములలో | వసంత ఋతువు |
| జ్యేష్ట-ఆషాఢములలో | గ్రీష్మ ఋతువు |
| శ్రావణ-భాద్రపదములలో | వర్ష ఋతువు |
| ఆశ్వీజ-కార్తీకములలో | శరదృతు ఋతువు |
| మార్గశిర-పుష్యములలో | హేమంత ఋతువు |
| మాఘ-ఫాల్గుణములలో | శిశిర ఋతువు |

38. అగ్ని స్తంభన మంత్రము :

మంత్రం : "ఉత్తర స్యాంచ దిగ్భాగే మారీచా నామ రాక్షసా॥ తస్యం పుత్ర పురీషాచ్యం హుతో వహ్ని స్తంభ స్వాహా"

అనే మంత్రం సిద్ధిచేసుకొని ఏడు దోసిళ్ల మంత్రించి చల్లిన అగ్ని స్తంభనయగును. అది చల్లారును దేవీ!

39. వృశ్చిక భయ నివారణము :

ఓ కలువలరాణీ! మంగాపురాధీశ్వరీ! శుభమగు నక్షత్రములో అమృత యోగసిద్ధి గల దినమున ఉత్తరేణి వేరును తెచ్చి కుడిచేత ధరించిన వృశ్చిక భయముండదు.

40 వృశ్చికాది వినాశనకరము :

ఓ హంసనడకల భామా! చెలీ! కలహంసా! బెల్లం-సాంబ్రాణీ-నల్లజీడి - విడంగములు - త్రిఫలములు (తాని-కరక-ఉసిరిక)-లక్క-జిల్లేడాకులు కలిపి ఎండించి; ఉండలుచేసి ఏ యింటిలోధూపము వేయుదురో ఆ ఇంటిలో దోమలు-నల్లులు-పాములు-తేళ్లు-పేలు-ఎలుకలు నశింపగలవు అనగానిలువవునుమా!

41. సర్ప భయం నాస్తి :

ఆస్తిక మహామునిని ధ్యానింపుచూ, నమస్కరించిన సర్ప భయం లేదు రాజనందినీ!

42. మూలికా యోగము :

ఆదివారం పుష్యమీ నక్షత్రంలో తిప్పతీగె వేరును తెచ్చి మాలగా మెడ ధరించిన సర్ప భయం ఉండదు.

43. ఈగల బాధా హరణము :

ఓ రత్నాల దీవిలోని అందాల జాబిల్లి అనుంగు సోదరీ మణీ! పాలవెల్లి భామా! హరిదళము, మజ్జిగ రెండూ కలిపి



ధూపం వేసి, ఇంటి మధ్య పాతిన భామా! ఆ ఇంటిలో అవాసనకు ఈగలు పారిపోవును

44. మూషక వినాశనము :

చంద్రుని చెల్లెలా! ప్రియమగు ఇల్లాలా! బెల్లం-జిల్లేడు పాలు-గురివిందలు - నువ్వులపొడి కలిపి జిల్లేడాకులో ఇంటి యందుంచినచో ఎలుకలు నశించును.

45. మూషక హరణ :

శుభాంగీ! ఉమ్మెత్తకాయల చూర్ణము వస-నాభి-నువ్వులు-చేపనూనె-కలిపి మర్దనచేసి గోలీలు గృహమందుంచగా తినిన ఎలుకలు అధిక పిపాస (దాహం)తో నశింపగలవు.

46. మూషకోచ్చాటనము :

శత్రువుల మర్దింపగల రౌద్రరస తాండవ విరాజితేశ్వరీ! హరిదళము, మేక మూత్రము-మేక పెంటికలు-ఎర్రసీరుల్లి-మర్దించి ఒక ఎలుకకు పూసిన దానిని చూచిన ఇతర ఎలుకలన్నియు భయపడి పారిపోవును.

47. అన్యోపాయం మూషికోచ్చాటనం :

భార్గవకుల లక్ష్మీ! పిల్లిమలము, హరితాళకము ఎలుక శరీరమునకు పులిమిన ఎలుకను చూచిన ఎలుకలు భయపడును గదా!

48. అన్యోపాయం మూషికోచ్చాటనం :

రాకేందువదనా! రాజరాజ పూజితేశ్వరీ! శుభగాత్రీ! ధాత్రీ పుత్రీ! చెలీ! గంధకము, హరిదళము- సాంబ్రాణీ-శొంఠి-పిప్పలి-మిరియములు సమభాగములుగా కలిపి ఆదివారము నాడు నర

338. బలుసు-కామాచి (కాకమాచి)(Solonum Nigrum) స్వరమున ఉత్తమత, వీర్యవృద్ధి, నేత్ర, హృదయ హితము చేయును. రసాయనము కుష్టు బోజేయును-

339. కాకిదొండ: (Gymerema Sylvestri) వెంట్రుకల నల్లబరచును దేహదృఢత నందించు రసాయనము

340. వెలమసంధి (కాకజంఘా) (Leea Hirta) క్షుద రోగనివారిణీ, చెవుడు పోగొట్టును.

341. హంసపాది : (Adiantum Lunulatum)అనబడు (Maiden Hair) భూతబాధ, అగ్నిరోహిణీ (బొబ్బలు) మూర్ఛ, భ్రమ తొలగించును. రసాయనము భూతోన్మాద వివిధ విషహారిణి. రసబంధని.

342. సోమలత: (Moon plant) పవిత్ర యజ్ఞసాధిని, క్షీరజనకము, రసాయనము.

343. ఇంద్రజాలి పాచితీగె ఆకాశవల్లీ : (Cuscuta Flexa) వీర్యవర్ధక, బలకారక దివ్యౌషధము రసాయనము. మహా మహిమ గలది దీనివేరు. తొక్కిన దారివి తప్పింప జేయు మాయావి.

344. దూసరి తీగె : ఆకాశగారుడి (Coculas Villosus) విషదోషారి, వీర్యవర్ధనీ-మధుమేహరోగ నివారిణి. మాంత్రికము గలది-

## బ ద ని క లు

345. బదనిక వృక్షభక్ష్య, వందా, వృక్షాదనీ వృక్షరుహా, జీవంతిక, శింవల్లీ,పుత్రిణీ, శిఖరీ, కేశరూపా, గంధమాదనీ, కామినీ, వజనికె (Lorants Largifoliahus) వీర్యవర్ధకము-వశీకరణాది సిద్ధుల నిచ్చును. దీనికి వేరు వేరే ఉండదు. ఇది చెట్లపై యుండును. చెట్లయందే జనించును. పక్షులు ఏదైనా వృక్షముతెచ్చి పెట్టిన, అది చిగురించును అని కొందరందురు. అది పూలు, పండ్లు కల్గి "వందా" యనబడును. పూలు ఆకులు వివిధ రంగులలో, ఆకారములలో యుండును. బదనికల విషయము ఇదే.



346. ఊడుగ : అశ్వనీ నక్షత్రంలో ధరించిన స్థావర-జంగమ విషాది బాధలుండవు. పామునోట్లో చేయి పెట్టినా ప్రమాదం ఉండదు.

347. అడ్డసరము : ఆరుద్రలో తెచ్చిన కుటుంబ పశు సంపదలు వర్ధిల్లును.

348. మజ్జి : అశ్వనిలో తెచ్చి ధరించిన, పాలతో కలిపి త్రాగినా సర్వరోగహరణము-

349. ఆదొండ: అమవస ఆదివారాన తెస్తే అగ్నిభయం ఉండదు-

350. రావి : రోహిణిలో ధరించిన సంపదలు కల్గును భూత బాధలుండవు-

351. చింత: మృగశిరలో దెచ్చిన సర్వరోగహారి. ఈ బదనికెను గేదె పేడలో కలిపి శరీరమునకు పూసుకొని విప్పులలోదూకవచ్చును చోరభయం ఉండదు.

352. విషముష్టిని పునర్వసులో తెచ్చిన సర్వ గ్రహ సర్ప విష-సర విష కాక లుండవు.

దీని రహస్యములు ఏ మానవుడు శ్రద్ధగా శ్రీశైల ప్రాకార ప్రదక్షిణం బొనరించునో అహోబలంబున సింహగర్జన వినునో వానికే తెలియును—

"సిద్ధా!గురు కృప్ బినా అనంత పృధ్వీమే సచ్చా హీ కచ్చా హోవే; అచరజ్ న అచరణీసే హో! బాబా!

గురు ప్రభావం అనంతము - అదే తెలియనిది. విర్లక్ష్య మున సాఫల్యత లేదు బిడ్డా!

122. విజయ హో! విజయ హో!

నల్లఉమ్మెత్త, గన్నేరు, ఉత్తరేణి, హరిదళం, సమాం శములుగా మేకపాలతో మర్దించి లలాటమందు తిలకము ధరించిన పందెములు, యుద్ధములలో విజయలాభసిద్ధి గల్గును.

123. సువర్ణకరనీయము : పార్వతీ యోగము

గోమూత్ర, హరిదళ, గంధక, మణిశిలల సమాంశము లుగా గోమూత్రి మెంకునంతవరకు మర్దించి,దానిని 21 దినము అర్ధే భద్రపరచి, దానిని బిళ్ళజేసి, వస్త్రముల చుట్టి, చీరమన్ను విచ్చి, గోతిలో మోదుగ కట్టెల మంటపై ఆ ఉండ నుంచి పైన మోదుగ కట్టెల నుంచి 24 గంటల కాలమగు ఒక అహోరాత్రము పుటము వేసిన భస్మమగును. ఆ భస్మమును బిందు మాత్రము రాగి కరగించి వేసిన బంగారు యగును.

124. శంకరుని యోగము.

ముసాంబరము 2 తులములు, 80 తులముల నల్ల అవు లలో వేసి 3 అహోరాత్రములు భావనచేయవలెను. $3 \times 80 =$ $240 + 2 = 242$ తులములను దీసుకొని, ముసాంబరమును విడి



గుడ్డలో మూటగట్టి, పాలలో ఉంచి, పాలన్నీ ఇగురునట్లు 1 అహోరాత్రము చల్లని మంట పెట్టవలెను. పాలు ఇంకిన తర్వాత ఆ మూటను చల్లని నీటిలో ఉంచాలి. దానిని తీసి నిప్పుపై వేసిన పొగ రాదు. ఒక అర తులం శుద్ధరాగిని కరిగి 1 రతి ప్రమాణం వేసిన వెండి యగును.

125. నాగమణి :

పాము నోట్లో రసముబోసి నోరు కొన (రెండువైపుల) బంధించి, మూకుడులో ఉంచి చీలజేసి, అడవి ప్రాంతమున నర సంచారము లేనిచోట సూర్యోదయాది సూర్యోదయ పర్యంతము మంటపై యుంచి చల్లార్చి, పుటము విప్పి, సర్పభస్మము విడచి "రసము" ను జాగ్రత్త చేసికొనవలెను. 1 తులం రాగి కరగి దీనిని 1 రతివేయుచో బంగారమగును.

126. మృతసంజీవనీ గుటిక

I చేదుసొర, కామంచి, వావిలి, కలబంద, ఎద్దునాలుక చెట్టు, సైంధవలవణం, గురిగింజ, అల్లములను సమాంశములుగా నూరి మూస లోపలి భాగాన 1 అంగుళము మందముగా పూయ వలెను.

II. దానిలో పాదరసము, అభ్రకసత్వము, కాంతము, లోహము, అయముల భస్మములు, మాక్షికసత్వములను సమభాగా లుగా నిమ్మపండ్ల రసంతో బాగుగా నూరి గోలీ (ఉండ) ని చేసి ఆ మూసలో ఉంచాలి. మొదటి I సారంతో తిరిగి కవచము చీల చేసి ఎండించి, అహోరాత్రము పిడకల పుటము వేయవలెను. పది పర్యాయములు ఈ విధముగా చేయుచూ పుటములు వేయగా అది గుటిక యగును.

1 లక్షకు సిద్ధి-నవరాత్రిలలో పూర్తిచేసి చివరి రోజు హోమం చేయాలి. స్వప్నంలో విధులు – మణులు-మూలికలు చూపును-కోరినవి ఇవ్వగల విద్య-

సద్యోస్తంభనము సర్వసిద్ధికరము :

ఓం అం హ్రీం వదవద ఐం క్లీం గ్లాం హూం క్రోం ఏహ్యేహి వదవద ఓం నమో భగవతీ వార్తాళీ వార్తాళీ వారాహీ వారాహీ వరాహ ముఖీ వరాహముఖీ ఓం ఐం గ్లాం ఐం అంధే అంధినీనమః రుంధే రుంధినీనమః జంభే జంభినీనమః మోహే మోహినీ నమః స్తంభే స్తంభినీ నమః ఓం ఐం గ్లాం ఐం వదవద ఈం ఐం గ్లాం ఐం నమః స్వాహా॥

1 లక్షకు సిద్ధి నవరాత్రిలలో పూర్తి కావాలి పేలాలు పాలు-అన్నం నివేదన - తిరుపతి-అహోబలం-శ్రీ శైలములలో శీఘ్ర సిద్ధి-అన్ని పనులు జరుగును-

529. నిధి దర్శనం-సాధనం-

ఓం అం హ్రీం ఐం క్లీం గ్లాం హూం క్రోం ఏహ్యేహి వద వద వార్తాళీ నిధిం దర్శయ దర్శయ పాతాళ నిధిం దర్శయదర్శయ దివ్యనిధిం దర్శయ దర్శయ మహావార్తాళీ అంధే అంధిన్యే రుంధే రుంధిన్యే జంభే జంభిన్యే వగవద పాతాళ నిధిం దర్శయ దర్శయ స్వాహా॥

సర్వసిద్ధికర కుబ్జికాదేవీ మంత్రం
సర్వవిజయకరం :

ఓం ఐం హ్రాం శ్రీం ఛేం హ్రీం హసక్షమ లవర యూం భగవతీ అంబికే హ్రాం హ్రీం క్షీం జ్రాం హ్రాం క్రీం



కుబ్జికే హ్రాం ఓం జం ఞం ణం నం మే అఘోర ముఖీ వ్రాం ఛ్రాం ఛ్రీం కిలికిలి ఞం విచ్చే ఖ్రోం శ్రీం క్రోం ఓం హ్రీం ఐం వజ్ర కుబ్జినీ స్త్రీం త్రైలోక్యాకర్షణీ హ్రీం కామాంగ ద్రావిణీ హ్రీం స్త్రీం మహాక్షోభకారిణి ఐంహ్రీం క్షౌం ఐంహ్రీం శ్రీం ఫేం ఞం నమో భగవతీ క్షౌం కుబ్జికే హ్రీం హ్రీం క్రైం జం ఞం ణం నం మే అఘోరముఖీ ఛ్రాం ఛ్రాం విచ్చే ఓం కిలి కిలి స్వాహా.

శత్రువుల గిరగిర త్రిప్పడం-

ఓం ద్రాక్షాయణీ స్వేగ్ని స్వేగ్నిం మమశత్రూన్ భ్రామయ భ్రామయ హుం ఫట్ స్వాహా

1 లక్షకు సిద్ధి-తంత్ర క్రియతో సాధన.

తారాంబా మంత్రం సర్వరోగ వినాశనము :

ఓం స్త్రీం హ్రీం హూం త్రీం ఫట్ స్వాహా॥

జలం మంత్రించి అభిషేకం (స్నానం) చేయించిన సర్వ రోగ హరణము 1 లక్ష ముందుగా సిద్ధి కావాలి-

వశ్యం :-చందనం మంత్రించి బొట్టు పెట్టుకోవాలి

స్త్రీ వశ్యం: "ఓం స్త్రీం హ్రీం క్లీం స్త్రీం వషట్"

ఒక లక్ష జపించి ఎవరిపై మంత్ర అక్షతలు చల్లిన వారలు వెంటబడి వత్తురు-

మహామారి భయ నివారణకు :

గ్రామానికి పడమటి దిశలో మారీ యంత్రం పెట్టాలి. ఈ యంత్రం రాయి-కొయ్యమీద వేయాలి. త్రికోణం-షట్కో-